
PARLE
Parle-G
Pa

జానపద చిత్రాలు కనుమరుగవుతున్న కాలంలో మళ్లీ వాటికి ఒరవడిగా
నిలిచిన అద్భుత చిత్రం!



చందమామ విజయా
కంబైన్స్



# భైరవద్వీపం

బి.వెంకట్రామరెడ్డి   సింగీతం శ్రీనివాసరావు




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి



## విద్యారంగంలో విప్లవం!

చైనాలో పిల్లలను బడికి పంపకపోతే తల్లిదండ్రులకు జరిమానా విధిస్తారని ఈమధ్య చందమామ కబుర్లలో కూడా చదువుకున్నాం. ఇటీవల మన రాష్ట్ర ప్రభుత్వాలు కొన్ని అదే పద్ధతిని అనుసరించడానికి ఆలోచిస్తున్నట్టు వార్తలు వెలువడ్డాయి.

మన రాజ్యాంగ శాసనం ప్రకారం, ఉచిత నిర్బంధ విద్య పేరుకు అమలులో వున్నప్పటికీ, వివిధ కారణాల వల్ల దానిని అమలుపరచడానికి సాధ్యం కావడం లేదు. పేదరికం దీనికి ముఖ్యమైన అవరోధం. పిల్లలు తమతోనే వుండి ఇంటా బయటా కష్టపడితే తప్ప పూట గడవని తల్లిదండ్రుల దుస్థితి ఒకవైపు; దగ్గర్లో బడులు లేకపోవడం మరొకవైపు; ఉన్నా అక్కడ కూర్చుని చదవడానికి తగిన వసతులతో కూడిన ఆసక్తికరమైన వాతావరణం లేకపోవడం — ఇలా ఎన్నో కారణాలు చెప్పవచ్చు.

ఇటీవల మన కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పిల్లలు బడికి రాలేకపోవడానికిగల కారణాలనూ, బాలకార్మికుల దుస్థితినీ పరిశీలించి, కొన్ని పరిష్కార మార్గాలు కూడా కనుగొన్నాయి. ఉన్నత పాఠశాల స్థాయి వరకు ఉచిత నిర్బంధ విద్యను అమలు చేయాలని కూడా కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు నిర్ణయించాయి. పాఠశాల వేళల్లో కూడా మార్పులు తీసుకురావాలనీ, పేద పిల్లలు నివసించే ప్రాంతాలలో వాళ్ళకు అనుకూలమయిన సమయాలను పాటించాలనీ కొందరు నిపుణులు, విద్యావేత్తలు సూచించడం ఆలోచించతగ్గ విషయం. వీరి సూచనలను పాటించి సక్రమంగా అమలుపరచినట్టయితే ప్రాథమిక స్థాయి విద్యారంగంలో విప్లవం వస్తుందనడంలో సందేహం లేదు!



సంపుటి : 95 జూలై '94 సంచిక : 1

విడిప్రతి : 4.00 సంవత్సర చందా : 48.00



నీళ్ళు నాకెంతో కావలసిన మిత్రులు నిజంగా
వాళ్ళని అలాగే అట్టేబెట్టుకుంటాను కలకాలంగా

కోరస్ వారి మనసును ముగ్ధుల్నిచేసే, మెరుపులు
చిందించే రంగులతో అందమైన చిత్రాలకి రంగులువేయండి.
వాటిని ఎల్లకాలం నిలిచుండేలా మీ దగ్గర అట్టేబెట్టుకోండి.

వళ్ళు పులకింపజేసే ఆర్ట్ మెటీరియల్‌తో నిండిన గనిలోంచి ఎంచుకోండి -
పోస్టర్ కలర్స్, వాటర్ కలర్స్, వేక్స్, ఫ్లోరసెంట్, ప్లాస్టిక్ రేయాన్స్ - మీ మనసుకు
నచ్చిన సామాగ్రిని తీసుకోండి. పోస్టర్లూ, బర్త్‌డే కార్డులూ, గ్రీటింగ్ కార్డులూ,
స్కూలు ప్రాజక్టులూ, వీటికి అలంకరణ కూర్చండి.















# కోరస్




## ఉచితం!

రంగులు వెయ్యడానికోసం ఆకర్షణీయమైన,
వళ్ళు పులకింపజేసే రేఖాచిత్రం.

మీ పేరూ, అడ్రసూ, విడివిడి అక్షరాలతో వ్రాసి, రూ. 1 పోస్టల్ కవరుతో జతపరచి పంపండి: కోరస్ (ఇండియా) లిమిటెడ్, పోస్ట్ బాక్స్ 6558, బొంబాయి 400 018.

**కోరస్ స్టూడెంట్స్ ఆర్ట్ మెటీరియల్ తెచ్చుకోండి. మీ లోకాన్ని రంగులమయం చేసుకోండి.**

AKA/593-TL

వార్తలు - విశేషాలు:

# రూపుదిద్దుకుంటూన్న దేశం

రెండు ఉత్తరాలతో ఆరంభమై, ఇద్దరు నాయకుల కరచాలనంతో ముగిసిన పశ్చిమ ఆసియా వ్యవహారం గురించి గత అక్టోబర్ నెల చందమామలో తెలుసుకున్నాం. అది పాలస్తీనా దేశ ఆవిర్భవానికి ఎలా నాంది పలికిందో కూడా తెలుసుకున్నాం. వాషింగ్టన్ నగరంలో సెప్టెంబర్‌లో ఉభయ పక్షాల మధ్య జరిగిన చరిత్రాత్మకమైన ఒప్పందం ప్రకారం- ఇజ్రాయెల్ గత 27 సంవత్సరాలుగా ఆక్రమించుకుని వున్న పశ్చిమ తీరం, గాజాస్ట్రిప్ ప్రాంతాల నుంచి మూడు నెలలలోగా వైదొలగాలి. పాలస్తీనియన్లు అక్కడ స్వతంత్ర ప్రభుత్వం ఏర్పాటుచేసుకోవడానికి అది దోహదం చేస్తుంది. అయితే, అలా వైదొలగడం అన్నది ఒప్పందంలో చెప్పిన గడువులోగా, అంటే డిసెంబర్ 13వ తేదీ వరకు జరగలేదు. పైగా అక్కడ మళ్ళీ హఠాత్తుగా చెలరేగి కొనసాగిన హింసాకాండ – ఇజ్రాయెల్ - పాలస్తీనా విమోచన సంస్థల మధ్య జరగవలసిన శాంతి చర్చలకు కూడా అంతరాయం కలిగింది.



అప్పటి వాషింగ్టన్ ఒప్పందం, నార్వే తీసుకున్న శ్రద్ధ, చొరవ కారణంగానే సాధ్యమయింది.

పాలస్తీనా విమోచన సంస్థ (పి.ఎల్.ఓ) అధ్యక్షుడు యాసర్ అరాఫత్ నుంచి, ఇజ్రాయెల్‌ను ఒక దేశంగా గుర్తించే ఉత్తరం పొందడానికీ, పాలస్తీనా విమోచన సంస్థ ఉనికిని, ఇజ్రాయెల్ చేత అంగీకరింపచేయడానికీ నార్వే కీలకపాత్ర వహించింది.

ఆ తరవాతే ఉభయ పక్షాలకు చెందిన ప్రతినిధులు – అమెరికా అధ్యక్షుడు బిల్ క్లింటన్ సమక్షంలో వాషింగ్టన్‌లో జరిగిన ఒప్పందంలో సంతకాలు చేయడానికి అంగీకరించారు.

మూడు నెలలలో అధికార మార్పిడి జరగగలదని యావత్ ప్రపంచం ఎదురు చూస్తూన్న తరుణంలో – డిసెంబర్‌లో జరిగిన 'హెబ్రాన్ మాస్క్' ఊచకోతలో 30-40 మంది పాలస్తీనియన్లు ప్రాణాలు కోల్పోవడం దిగ్భ్రాంతి కలిగించింది. వెంటనే పి.ఎల్.ఓ. చర్చల నుంచి విరమించింది.

ఆ ప్రాంతంలో ఉద్రిక్తవాతావరణం చల్లబడిన తరవాత, ఈజిప్టు ఎంతో చొరవ తీసుకుని ఉభయ పక్షాలను చర్చలకు సమావేశపరిచింది.




ఈజిప్టు రాజధాని కైరోలో మే 4వ తేదీ ఇజ్రాయెల్ ప్రధాని ఇజ్షక్ రాబిన్, పి.ఎల్.ఓ. నాయకుడు యాసర్ అరాఫత్, ఆఖరి ఒప్పందంలో సంతకాలు చేశారు.

ఎనిమిది నెలలలో రెండవసారి ఉభయ నాయకులు కరచాలనం చేసుకున్నారు.

మే 10వ తేదీ 150 మంది పాలస్తీనా పోలీసులు గాజాస్ట్రిప్ చేరుకోవడం చూసి, అక్కడి పాలస్తీనియన్లు హర్షధ్వానాలు చేశారు. మరొక వారంలో ఇజ్రాయెల్, మిలిటరీ ప్రధాన కార్యాలయాన్ని పి.ఎల్.ఓ.కు అప్పగించింది.

ఆ విధంగా ఆ ప్రాంతంలో అధికార మార్పిడి పూర్తయింది.

మే 13వ తేదీ పశ్చిమ తీర పట్టణం జెరికోలో పి.ఎల్.ఓ. కార్యకర్తలు పోలీస్ స్టేషన్ అధికారం స్వీకరించి, భవనం మీద తమ పతాకాన్ని ఎగుర వేయడం చూసి, స్థానికులు ఆనందాతిరేకంతో పొంగిపోయారు.

ఆ విధంగా పాలస్తీనా ఒక దేశంగా రూపుదిద్దుకోవడం ఆరంభమయింది. అక్టోబర్ నెలాఖరులో జాతీయ ఎన్నికలు జరిగే వరకు పి.ఎల్.ఓ. నాయకత్వంలో తాత్కాలిక ప్రభుత్వం ఏర్పాటు చేయబడుతుంది. సంపూర్ణ పాలస్తీనా రూపుదిద్దుకునేంత వరకు పశ్చిమ ఆసియాలో శ్రమపడి సాధించిన శాంతిని నిలబెట్టుకోవడానికి ప్రపంచ దేశాలు సాయపడాలని పి.ఎల్. ఓ. – ఇజ్రాయెల్ విజ్ఞప్తి చేశాయి.



# వెయ్యేళ్ళ ప్రమాదం

ఒకానొకప్పుడు కర్పూరదేశాన్ని రణధీరుడనే రాజు పాలిస్తూండేవాడు. ఆయన కొడుకు కదనుడు మహాబలశాలి, పరాక్రమవంతుడు, ధైర్యసాహసాలకు పెట్టిందిపేరు. అతడికి వున్న చెడ్డగుణమల్లా అహంకారం.

కదనుడికి కవి పండితులంటే గౌరవం లేదు. కళలపట్ల అభిరుచి లేదు. సాధు సన్యాసులపట్ల ఆదరణ లేదు. దేవుడి మీద నమ్మకం లేదు. ఈ ప్రపంచంలో తనను మించినవాడు లేడని అతడి గర్వం.

ఒకరోజున దివ్యదృష్టి గల ఋషి ఒకడు రాజాస్థానానికివచ్చి,రాజు రణధీరుడితో, "రాజా! నీ రాజ్యానికి గల వెయ్యేళ్ళ ప్రమాదం గురించి నీకు తెలుసా?" అని అడిగాడు.

వెయ్యేళ్ళ ప్రమాదం గురించి ఆ రాజ్యంలో అంతా కథలు చెప్పుకుంటూంటారు. దుర్భరారణ్యానికి సమీపంలో ఒక పల్లె వున్నది. ఆ పల్లె ప్రవేశ ద్వారం వద్ద నిలువెత్తు ఢక్క వున్నది. వెయ్యేళ్ళకొకసారి అది మ్రోగుతుందిట. ఆ భయంకర శబ్దానికి భూమి కంపించి రాజ్యంలోని కట్టడాలన్నీ నేలకూలిపోతాయట.

ఆ పల్లె నుంచి దుర్భరారణ్యానికి ప్రవేశించే మార్గంలో,దారికి పక్కగా పాతాళకూపం వున్నది. అందులో ప్రవేశించిన వారెవ్వరూ బయటకు రాలేదు. అది పాతాళానికి దారి అనిఅంతాఅంటారు. వెయ్యేళ్ళకొకసారి అందులోంచి పది తలల విష సర్పం బయటకు వచ్చి, ఆ రాజ్యంలోని జంతుజాలాన్ని భక్షించి వేస్తుందని అంతా చెప్పుకుంటారు. ఆ విష సర్పం చిందించే విష జ్వాలల కారణంగా రాజ్యంలోని పంటలు, ఫలవృక్షాలు పూర్తిగా నశించి ఎక్కడా పచ్చదనమన్నది లేకుండా పోతుందిట.

దుర్భరారణ్యంలో భీకరుడనే రాక్షసుడొకడు ఎవరికీ తెలియని రహస్య ప్రాంతంలో నిద్రపోతూంటాడు. వెయ్యేళ్ళకొకసారి వాడు

"వసుంధర"



నిద్రలేచి రాజ్యంలోని మనుషులందర్నీ తినేసి మళ్ళీ నిద్రపోతాడు.

ఈవిధంగా కర్పూరదేశం ప్రతి వెయ్యేళ్ళకు ఒకసారి సర్వనాశనమవుతూ పునర్నిర్మింపబడుతూ వస్తున్నది. పునర్నిర్మాణానికి కనీసం ఒక శతాబ్దం పడుతుంది.

రాజు రణధీరుడికి కర్పూరదేశానికున్న వెయ్యేళ్ళ ప్రమాదం గురించి తెలుసు. అది ఋషి నోట వినగానే ఆయన కలవరపడ్డాడు. ఆయనను మరింత కలవరపెట్టే విధంగా ఋషి, "వచ్చే పున్నమికి సరిగ్గా రెండు మాసాల వ్యవధిలో దేశానికి వెయ్యేళ్ళ ప్రమాదం రానున్నది. ఈ విషయం దివ్యదృష్టితో తెలుసుకుని నిన్ను హెచ్చరించడానికి వచ్చాను," అన్నాడు.

ఈ మాటలు వింటూ రాజసభలో వున్న యువరాజు కదనుడుఫక్కుననవ్వి,తన చేతిలోని కత్తిని ఋషి మీదికి విసిరాడు. ఆ కత్తి గిరగిరా తిరుగుతూ విన్యాసాలు చేస్తూ ఆయన దండకమండలాలనునేలమీదికిపడగొట్టింది.

"తనమీద కత్తి ఎప్పుడు పడుతుందో తెలియనివాడు, రాజ్యానికి వచ్చే వెయ్యేళ్ళ ప్రమాదాన్ని పసిగట్టగలడా? ఇలాంటి వారి మాటలు బుద్ధిహీనులు నమ్ముతారేమో గానీ, కర్పూర రాజులు వినరు!" అన్నాడు కదనుడు.

ఋషి చప్పున దండకమండలాలనందుకుని, "అహంకార పూరితుడైన రాజు వల్ల దేశానికి అనుక్షణం ప్రమాదమే! వెయ్యేళ్ళ ప్రమాదంతో పాటు దీన్నీ నివారించటం నా బాధ్యత. సరిగ్గా ఈరోజు నుంచి నాలుగవ నాడు యువరాజును సవాలు చేసే మహావీరుడొకడు వస్తాడు. అతడే ఈ దేశాన్ని అన్ని ప్రమాదాల నుంచీ కాపాడతాడు!"అని అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

తన కొడుకును ఋషి శపించనందుకు సంతోషించినా, జరిగినదానికి రణధీరుడు కొంత బాధపడ్డాడు. కానీ కొడుకునేమీ అనలేక వూరుకున్నాడు.

ఋషి రాజధాని నుంచి ఒక గ్రామం చేరుకుని, అక్కడ ఒక సామాన్య గృహస్థు ఇంట భిక్ష స్వీకరించి, అతడితో, "నీ ఆతిథ్యం నాకెంతో సంతోషం కలిగించింది. నీకేమైనా సమస్య వుంటే చెప్పు. తీర్చగలను," అన్నాడు.

అందుకు గృహస్థు, "స్వామీ! నాకొక కొర గాని కొడుకున్నాడు. వాడి పేరు విద్యాధరుడు. చదువుకోరా అంటే, మహావీరుడినౌతానం టాడు. పోనీ వీరుడౌతాడా అంటే — పిల్లిని చూస్తే భయం. కత్తిని పట్టాలంటే వణుకు. చీకటిలో బెదురు. దయ్యాల కథలు వింటే చాలు జడుసుకుంటాడు. మహావీరుడినన్న కీర్తి తెచ్చుకోవాలన్న కోర్కె మాత్రముంది. వాడినెలా బాగుచెయ్యాలో తెలియడం లేదు. మీరు సాయపడగలరా?" అని అడిగాడు.

"నీ కొడుకును నావెంట పంపు. వాణ్ణి గొప్పవాణ్ణి చేసి నీ వద్దకు పంపుతాను," అన్నాడు ఋషి.

గృహస్థు సంతోషంగా అంగీకరించాడు. ఋషి విద్యాధరుణ్ణి వెంటబెట్టుకుని రాజధా నికి బయల్దేరాక, ఆయన వాడితో, "నేను చెప్పినట్లు చేస్తే నీకు ఏ శ్రమా లేకుండా మహావీరుడన్న కీర్తి వస్తుంది. అయితే కొద్ది క్షణాలసేపు ధైర్యంగా కత్తి పట్టుకోవాలి. కద నుడనే వాడితో యుద్ధం చేయాలి. నీ ఒంటికి గాయం కాదు, నీకు దెబ్బలు తగలవు. ఈ యుద్ధం కూడా ఒక్కసారి మాత్రం చేస్తే చాలు. మళ్ళీ జీవితంలో నువ్వు కత్తి పట్టుకో నవ సరం లేదు!" అన్నాడు.

"ఒక్కసారికే అయితే ఎలాగో అలాగున ప్రయత్నిస్తాను. ఆ తర్వాత మాత్రం నావల్ల కాదు," అన్నాడు విద్యాధరుడు చిన్నగా వణు కుతూ.



ఋషి, విద్యాధరుడిని వెంటబెట్టుకుని అన్నరోజుకు రాజసభకు వెళ్ళి, రాజు రణ ధీరుడితో, "రాజా! దుర్భరారణ్యానికి సమీప గ్రామంలో ఒక శమీవృక్షమున్నది. ఇదివరలో దేశం సర్వనాశనం కాగా మిగిలిన వారిలో కొందరు తపస్సు చేసి, దేశానికి వెయ్యేళ్ళ ప్రమాదం తగ్గించే శక్తులు కొన్ని సంపాదించి, వాటిని శవాకారంలో శమీవృక్షంపై వుంచారు. తాము పిశాచాలై ఆ శక్తులను కాపలా కాస్తు న్నారు. ఆ శక్తులను సంపాదించగల మహా వీరుడు యువరాజు కదనుడేనని భావిం చాను. కానీ, అహంకారంతో నన్నే అవమానిం చిన వాడికది సాధ్యం కాదు. అందుకే దేశ మంతా వెదికి వెదికి, ఈ వీరుణ్ణి తీసుకొచ్చాను.



విద్యాధరుడనే పేరుగల ఇతడిప్పుడు కదను డితో తలపడితే – నెగ్గినవాడు దుర్భరారణ్యా నికి ప్రయాణం కాగలడు. దేశానికి ప్రమాదం తప్పించగలడు. పోటీకి ఏర్పాటు చేయించు," అని చెప్పాడు.

కదనుడు ముందుకు వచ్చాడు. ఋషి ఆదేశం ప్రకారం ఇద్దరికీ ముఖానికి నల్లటి ముసుగులు తొడగబడ్డాయి. కనులు కనిపించ డానికి ముసుగులో రెండు రంధ్రాలున్నాయి. ఇద్దరూ ఒకే రకం దుస్తులు ధరించారు.

పోటీ ప్రారంభమైన కొద్ది క్షణాల్లోనే ముగిసి పోయింది. వాళ్ళల్లో ఒకడు కత్తిని జారవిడిచి నేలకూలాడు. అందరూ యువరాజు కదనుడే నెగ్గాడని భావించారు. కానీ ముసుగు తీయ గానే గెలిచినవాడు విద్యాధరుడని అర్థమ యింది.

అందరూ ఆశ్చర్యపడ్డారు. ఆ వెంటనే విద్యాధరుడి పేరిట జయజయధ్వానాలు మిన్నుముట్టాయి.

అప్పుడు ఋషి వారిద్దరినీ ఏకాంతానికి తీసుకువెళ్ళి, "నా మహిమ వల్ల మీ ఇద్దరి రూపాలూ తారుమారయ్యాయి. కదనుడు, విద్యాధరుడయ్యాడు; విద్యాధరుడు, కదనుడ య్యాడు. ఈ రహస్యం మీరు చెప్పాలన్నా బయటకు చెప్పలేరు. విద్యాధరుడు, కదను డుగా వుండాలనుకున్నంత కాలం కదనుడు, విద్యాధరుడి రూపంలోనే వుండక తప్పదు. ఆ రూపంలోనే కదనుడు శమీవృక్షం నుంచి శక్తులను సాధించి కంచు ఢక్కనూ, విష సర్పాన్నీ, రాక్షసుణ్ణీ శాశ్వతంగా నాశనం చేయ వలసి వుంటుంది," అని చెప్పాడు.

కదనుడి రూపంలో వున్న విద్యాధరుడు రాజాంతఃపురంలో స్థిరపడ్డాడు - రాజు వాడిని పిలిచి, "ఈ ప్రపంచంలో ప్రతి మహావీరుడూ అపజయాన్ని కూడా చవిచూసి వున్నాడు. నీ ఓటమికి బాధపడకు. మళ్ళీ కత్తిని చేతపట్టి, ధనుర్బాణాలు సంధించు. నీ పరాక్రమాన్ని లోకానికి నిరూపించు. ఒకడి చేతిలో ఓడావని ఇప్పుడు గతంలో నీచేత ఓడిన మంత్రి కుమా రుడు, సేనాధిపతి కుమారుడు నీమీద కాలు దువ్వుతున్నారు. అందర్నీ ఓడించి నీ పేరు నిలబెట్టుకో!" అని ప్రోత్సహించాడు.

దీనికి విద్యాధరుడు అడ్డంగా తలవూపి, "జయాపజయాలు దైవాధీనాలు. నా అపజయానికి కారణం ప్రత్యర్థి శక్తి కాదు, నా అహంకారం. నేనిప్పుడు అహంకారాన్ని జయించి, ఆ తర్వాత ఇతరులను జయించదలుచుకున్నాను. కొంతకాలం పాటు నేను పండితుల వద్ద శాస్త్రాలు అభ్యసిస్తాను. పురాణ కథలు వింటాను. సాధుపుంగవులను గౌరవిస్తాను. ఒక మిత్రుణ్ణి నిత్యమూ వెంట వుంచుకుని ఉల్లాసమైన కథలు చెప్పించుకుంటాను," అన్నాడు.



రాజు, కొడుకులో వచ్చిన మార్పుకు చాలా సంతోషించాడు.

విద్యాధరుడు, రాజుకిలా చెప్పడానికి తగిన కారణముంది. వాడికి ఇప్పటికీ కత్తి పట్టాలంటే భయం. ఒంటరిగా వుండాలంటే భయం. చీకటంటే భయం. ఈ భయాల నుంచి తప్పించుకునేందుకు వాడీ ఏర్పాటు చేసుకున్నాడు.

ప్రతిరోజూ భట్రాజులు కొందరు వచ్చి, కదనుడి రూపంలో వున్న విద్యాధరుణ్ణి మహావీరుడంటూ పొగిడి వెళుతుండేవాళ్ళు. అది విన్నప్పుడల్లా వాడు అసహనంగా కదిలేవాడు. జరిగినదేమిటో తెలియని కవి పండితులనూ, కళాకారులనూ, రాజధాని పౌరులనూ వాడి ప్రవర్తన బాగా ఆకర్షించింది. వాడి మంచితనాన్ని అందరూ మెచ్చుకోసాగారు. వాడు నగర పౌరుల ఇబ్బందులను చారుల ద్వారా తెలుసుకుని, వాటిని దానధర్మాల ద్వారా పరిష్కరించసాగాడు. దాంతో వాడికి రాజధానిలో ఎక్కడలేని పేరూ వచ్చింది.

అలా రోజులు, వారాలు, నెలలు గడిచిపోయాయి. విద్యాధరుడి రూపంలో వున్న కదనుడు శమీవృక్షపు శక్తుల్ని సాధించి, దేశానికి వెయ్యేళ్ళ ప్రమాదాలు మూడింటినీ శాశ్వతంగా తొలగించి రాజధానికి చేరాడు.

ఆ సమయంలో అక్కడికి వచ్చిన ఋషి, విద్యాధరుణ్ణి ఉద్యానవనంలోకి తీసుకుపోయి, "కేవలం అహంకారం కారణంగా, ఈ ఘనకార్యాన్ని సాధించే అవకాశం పోగొట్టుకున్నాడు కదనుడు. అయినప్పటికీ అతడే ఈ దేశానికి యువరాజు. విద్యాధరుడు కారణజన్ముడు.

దేశానికి ప్రమాదం తప్పించడం వరకే అతడి వంతు," అని చెప్పాడు.

ఇది విని విద్యాధరుడి రూపంలో వున్న కదనుడు నిరుత్సాహపడ్డాడు. ఏదో విధంగా దేశానికి రాజు కావాలని వాడి కోరిక. కానీ యువరాజు కాకపోవడం వల్ల, వాడికా అవకాశం లేకుండాపోయింది. అప్పుడు కదనుడి రూపంలో వున్న విద్యాధరుడు, ఋషితో, "మహాత్మా! మా రూపాలు యథాప్రకారం అయ్యేలా అనుగ్రహించండి," అని కోరాడు.

ఋషి ఆశ్చర్యపడి, "ఇప్పుడు నువ్వు దేశానికి రాజువు కాబోతున్నావు. ఆ అవకాశాన్ని కూడా వదులుకుంటున్నావంటే, నీ కీర్తికాంక్ష ఇంతా అంతా కాదనుకోవాలి. ఇప్పుడు విద్యాధరుడికి దేశమంతటా కీర్తి ప్రతిష్ఠలున్నాయి. అందుకని నువ్వు వాటిని అనుభవించాలనుకుంటున్నావు, అవునా?" అని ప్రశ్నించాడు.

దానికి విద్యాధరుడు వినయంగా, "ప్రతి రోజూ నన్ను రాజాశ్రితులు మహావీరుడివని పొగుడుతున్నారు. నాకది తృప్తినివ్వడం లేదు. నేను సాధించనిదానికీ, నాకు లేనిదానికీ లభించే పొగడ్తలు నాకు తృప్తినివ్వవని తెలుసుకున్నాను. అయితే, కదనుడి రూపంలో నేను ప్రజలకెన్నో మేళ్ళు చేశాను. వాటివల్ల కదనుడి పేరుకు లభించిన కీర్తి నాకెంతో సంతోషాన్నిచ్చింది. కానీ ఆ మంచి పేరు నా పేరుకే వచ్చేలా కృషి చేయాలని నా కోరిక. అందుకే మా రూపాలు పూర్వంలా మార్చమని తమను కోరాను," అన్నాడు.

ఇదివిని ఋషి తృప్తిగా నవ్వి, "సరే, ఒకే దెబ్బతో కదనుడి అహంకారం తొలగిపోయింది. నీ కొరగానితనం నశించింది. ముందు కదనుడు నీకే ఆపద తలపెట్టినా, మీ ఇద్దరి రూపాలూ మళ్ళీ తారుమారవుతాయి. కాబట్టిఇదిహెచ్చరికగాతీసుకుని, మీరిరువురూ కలకాలం సుఖంగా వుండండి," అని ఎవరి రూపాలు వారికిచ్చి, ఋషి వెళ్ళిపోయాడు.

అంతులేని ధన కనక వస్తు వాహనాలతో పాటు మంచి బుద్ధిని సంపాదించి విద్యాధరుడూ — మహాపరాక్రమవంతుడై అహంకారాన్నివిడిచిపెట్టి కదనుడూ—తమతమ తల్లిదండ్రులకు ఎంతో ఆనందాన్ని కలిగించారు.






# 3

[విచిత్రవర్మ పండితుల సలహా ప్రకారం అరణ్యంలోనే గుడి కట్టించి, భూగర్భంలో లభించిన దేవీవిగ్రహాన్ని అందులో ప్రతిష్ఠించాడు. కొన్నాళ్ళకు విచిత్రవర్మ కుమారుడు జయవర్మ సింహాసనం అధిష్ఠించాడు. ఆయన దగ్గరున్న ముత్యాల హారాన్ని కాజేయాలని కాంభోజరాజు వరుణదత్తుడు పథకం వేసి, అందుకోసం ఒక నర్తకిని పంపాడు. విషయం గ్రహించిన విచిత్రవర్మ, ఉపాయంతో ఆ హారాన్ని కాపాడాడు. అయితే, ఆసంగతి జయవర్మకు తెలియదు. విచిత్రవర్మ మరణానంతరం, ఆయన రాయించిన ఒక ఉత్తరాన్ని జయసేనుడు జయవర్మకు తెచ్చి ఇచ్చాడు. — తరవాత]

జయసేనుడి మాటలు విని నిట్టూర్చిన జయవర్మ, "పోనివ్వండి, జయసేనా! ఇందులో నాన్నగారి తప్పేమీ లేదు. ఆయన నా మీద వుంచిన నమ్మకాన్ని, నేను నిలబెట్టుకోలేక పోయాను. ఆయన ఆ అపూర్వహారాన్ని ఎవరికీ దానం చెయ్యలేదు కదా! ఆయనకు వారసుడ్నై, దాన్ని అనుభవించబోయేవాడు, నాకు మాత్రం వారసుడు కాదా?" అని, ఆ ఉత్తరాన్ని పెట్టెలో నుంచి తీసి, ఇలా చదివాడు:

"నాయనా, జయా! జయసేనుడు అంతా చెప్పాడు గదా! నేను చేసిన పనికి, నువ్వు నా మీద అగ్రహించవని, నా నమ్మకం. ఆ నమ్మకంతోనే సాహసించాను!

ఇకపోతే ఆ హారం ఎక్కడ దాచానో నాకు తప్ప ఎవరికీ — చివరకు జయసేనుడికి కూడా తెలియదు. అది ఎక్కడ వున్నదో తెలుసుకోవటానికి, ఈ క్రింది ఆధారాలు మాత్రం వదలిపోతున్నాను!

లక్ష్మీగాయత్రి



జయా! సమస్తలోకాలకూ పూజనీయురా లైన పరమేశ్వరి కూడా స్త్రీయే! ఆమె తల వంచేది ఎవరి ముందు? ఆ వ్యక్తి నివసించేది ఏ దిక్కున? మనిషికి జీవనాధారమైన దాన్ని ప్రసాదించేదీ, పంచభూతాలలో ఒకటీ అయిన దేది? దాన్ని ఒక అడుగుగా కొలిచినవాడు అడిగిన మొత్తం ఎంత? నాయనా, ప్రాప్తంగల వాడికి పై ప్రశ్నలకు సమాధానాలు స్ఫురిస్తాయి! సమాధానాలు స్ఫురించినవాడికి లాభం ప్రాప్తి స్తుంది! నీకు సర్వశుభాలూ కలగాలని ఆశీర్వ దిస్తూ, నీ తండ్రి విచిత్రవర్మ."

ఉత్తరం చదివిన జయవర్మ, దాన్ని కళ్ళ కద్దుకుని తిరిగి దంతపు పెట్టెలో పెట్టేశాడు. ఐదు తరాలు గడిచినా, ఆ ఉత్తరం చదివి రకరకాల వ్యాఖ్యానాలూ ప్రయత్నాలతో విసు గెత్తి పోయినవాళ్ళేగాని, సరైన అర్థం గ్రహించి, ఆ హారం సంపాదించినవాళ్ళు లేరు. కాని, అనేక తర్జనభర్జనల తర్వాత, ఆ హారాన్ని తూర్పుటడవుల్లో వున్న శక్తి ఆలయంలోనే ఎక్కడో పాతిపెట్టి ఉంటారని, మన మహారాజు సుషేణుడి తండ్రి నిశ్చయించాడు. కాని, ఆ ఆలయంలో తవ్వకాలు జరపబోయే సమయా నికి ఆటంకాలు ఏవో ఏర్పడటంతో, ఆయన ఆ ప్రయత్నాన్నే విరమించుకున్నాడు. తర్వాత సింహాసనాన్ని అధిష్ఠించిన మన మహారాజు మాత్రం ఎందుకనో ఆ హారం కోసం ప్రయ త్నమే చెయ్యలేదు!" అంటూ ఒక్కక్షణం ఆగి అలుపు తీర్చుకున్న జయసేనుడు, "కాని...." అంటూ తిరిగి ప్రారంభించి, "ఆ హారం లభించబోయే వ్యక్తి తన కొడుకు అయితే బాగుండునన్న ఆశ మహారాజుకు బాగా వున్నది. మహారాజుకు నీ మేధస్సు మీద మంచి గురి కుదిరినట్టున్నది. కీర్తిసింహుడి వంటి మేధాశాలికి, నీ వంటి తెలివిమంతు రాలు తోడైతే, ఇద్దరూ కలిసి ఈ కార్యాన్ని అవలీలగా సాధించగలరని, మహారాజు అభి ప్రాయపడి వుంటాడు. కీర్తిసింహుణ్ణి తూర్పుట డవుల్లోని శక్తి ఆలయంలోనే బంధించమని మహారాజు నాక్కి చెప్పటం చూస్తే, నాకు అదే అనిపిస్తున్నది," అన్నాడు.

తండ్రి మాటలకు శక్తిసేన తలవూపుతూ, "అంతే అయివుంటుంది, నాన్నా! ఈ విషయం

గూఢంగా చెప్పటంద్వారా మహారాజు మనకు తొలి పరీక్ష పెట్టినట్టే!" అన్నది.

జయసేనుడు నవ్వి, "ఆ పరీక్షలో నువ్వు నెగ్గావు గదా, తల్లీ! నువ్వేగనక చెప్పకపోతే నాకీ ఆలోచన వచ్చివుండేదే కాదు," అన్నాడు.

శక్తిసేన చిరునవ్వు నవ్వి వూరుకున్నది.

మరునాడు జయసేనుడు, రాజప్రాసాదానికి వెళ్ళేసరికి భటులు, మహారాజు అంతరంగిక మందిరంలో జయసేనుడి కోసం ఎదురు చూస్తున్నట్టు వార్త అందించారు. జయసేనుడు వెంటనే అక్కడకు వెళ్ళాడు.

చిరునవ్వుతో తనకు నమస్కరిస్తున్న జయసేనుణ్ణి చూడగానే, మహారాజు మందహాసం చేసి, "ఏం, జయసేనా! నీ కుమార్తెను ఒంటరిగా పంపటానికి సిద్ధమేనా?" అని ప్రశ్నించాడు.

జయసేనుడు ఆ ప్రశ్నకు సిగ్గుపడుతూ నవ్వి, "నిన్న నేను తండ్రిగా కాస్త అతిగా ప్రవర్తించిన మాట నిజమే, ప్రభూ! అయితే, మీరు వెళ్ళిన తర్వాత, నా కుమార్తె మాటలతో, మీ అభిప్రాయం గ్రహించగలిగాను. నేనూ, నా కుటుంబం సర్వదా మీ సేవకు సంసిద్ధులం. నా కుమార్తె శక్తిసేన, శుక్ల చతుర్దశి నాడే బయలుదేరి వెళ్ళి, మార్గమధ్యంలోనే రాకుమారుణ్ణి కలుసుకుని, తాను చెయ్యగలిగినదంతా చేస్తుంది," అన్నాడు.

జయసేనుడి మాటలు విన్న సుషేణుడు గంభీరంగా, "నా ఆశనూ, అభిప్రాయాన్నీ అర్థం చేసుకున్నందుకు చాలా సంతోషం జయసేనా!



అయితే, నేను ఇంత తొందర పడుతున్నందుకు గల కారణం కూడా చెబుతాను విను!

నా పూర్వీకుడైన జయవర్మ, హారం పోగొట్టుకున్నప్పటికీ చాలా సమర్థవంతంగా పాలించటం చేత, కోసల దక్షిణాపథంలో అగ్రరాజ్యంగానే నిలిచింది. అటు వరుణదత్తుడు రాజ్యాభివృద్ధి చెయ్యాలన్న కాంక్షగల వాడైనప్పటికీ మూర్ఖుడు కావటం చేత, కాంభోజ అభివృద్ధి కుంటినడక గానే సాగింది. ఇక పోతే, వరుణదత్తుడికి, అతడి చివరి రోజుల్లో తాను నర్తకి ద్వారా సంపాదించినది నకిలీహారమనీ, వృద్ధరాజు పథకం వేసి అసలు హారాన్ని ఎక్కడో దాచేశాడనీ గూఢచారుల ద్వారా తెలిసింది. నాటి నుంచి కాంభోజ రాజులు, కోసలతో



నిగూఢ శత్రుత్వం వహించి, అదను దొరికితే చాలు, మట్టుబెట్టో మాయచేసో ఆ హారాన్ని చేజిక్కించుకోవాలని ఎదురుచూస్తూనే వున్నారు. అయితే, హారం ఎక్కడున్నదో కోసల రాజులు కూడా గ్రహించలేక పోవడం చేత, వాళ్ళకు ఈనాటి వరకు ఏం చేసేందుకూ అవకాశం లేకుండాపోయింది.

అయితే, ప్రస్తుతం కాంభోజను పరిపాలిస్తున్న వరుణదత్తుడి వారసుడు గరుడదత్తుడు, తన తండ్రి తాతల కంటే కూడా, హారం విషయంలో పట్టుదలగా వున్నట్టు, మన వేగులు వార్త తెచ్చారు. అంతేకాదు, హారం దొరక్కపోతే, కనీసం హారం ఎక్కడ వున్నదో చెబుతూ వృద్ధరాజు విచిత్రవర్మ వ్రాసి పెట్టిన ఉత్తరాన్నయినా సరే చేజిక్కించుకోవాలని గరుడదత్తుడు చాలా పంతంగా వున్నాడు. ఆ పని మీదే అతడు మనదేశానికి పంపిన ఇద్దరు ముగ్గురు వేగుల్ని, మన వాళ్ళు బందీలుగా పట్టుకున్నారు. దాంతో గరుడదత్తుడు ఇంకేవో పథకాలు వేస్తున్నాడని వార్త తెలిసింది. అయితే, ఆ పథకం ఏమిటన్నది ఖచ్చితంగా తెలియలేదు. ఈ పరిస్థితుల్లో మనం ఎంత త్వరగా వీలైతే అంత త్వరగా, ఆ హారాన్ని చేజిక్కించుకుని, ఆ తర్వాత కాంభోజ మీదికి దండెత్తటం మంచిదని, నా అభిప్రాయం. అందుకే, మహామహుడైన కృష్ణచంద్రుడు, యువరాజు ప్రయాణానికి పెట్టిన ముహూర్తమే, ఈ మహత్కార్యారంభానికి ముహూర్తమైతే బాగుంటుందని, కృష్ణచంద్రుడి గురుకులం నుంచి బైలుదేరిన కీర్తిసింహుణ్ణి తూర్పు వైపు మళ్ళించాలని ఆలోచించాను! నీ కుమార్తె చురుకుదనమూ, తెలివితేటలూ గమనించిన క్షణం నుంచీ, అతడికి నీ కుమార్తె కూడా తోడైతే బాగుండుననిపించింది. దాని ఫలితమే ఇది! ఇక నీ అనుమానాలన్నీ తీరినట్టేనా?" అని ప్రశ్నించాడు.

జయసేనుడు తలవూపి, "ఇంతకూ యువరాజుకు, ఈ హారం సంగతి ఏమైనా తెలుసా, ప్రభూ?" అని అడిగాడు.

"పూర్వీకుల నాటి ఒక అపూర్వ హారం వున్నదనీ, అది ఎక్కడో గుప్తంగా వుంచబడిందనీ మాత్రం తెలుసు. అంతకుమించి వివ

స్నేహితురాలన్న సంగతి మీరు మర్చిపోయారా, ప్రభూ? కీర్తిసింహుడు ఇప్పటికీ అమెను మర్చిపోలేదు. నేను వాడిని చూడడం కోసం గురుకులానికి వెళ్ళినప్పుడల్లా, శక్తిసేన యోగ క్షేమాలు విచారిస్తాడు. శక్తిసేన కూడా మీరన్న దానికి మారు మాట్లాడకుండా ఒప్పుకోవటానికి కారణం, కీర్తిసింహుడే. మీరు ధైర్యంగా వుండవచ్చు,శక్తిసేన మనకు కాబోయే కోడలే!" అన్నది.



రాణి మాటలు విని తేలికపడ్డ మనసుతో సుషేణుడు,"సరే, ఇంతకూ ఆకాశానికి రాజూ, రాణీ ఎవరు?"అంటూ ప్రశ్నించాడు.

వైష్ణవీదేవి నవ్వి,"అదిమాత్రంనేనుచెప్పను! వివాహానంతరం, మనకోడలినే అడిగి తెలుసు కోండి," అన్నది. మహారాజు తృప్తిగా కళ్ళు మూసుకుని, నిద్రకు ఉపక్రమించాడు.

ఇక్కడ కోసలలో ఇలా వుండగా — అక్కడ కాంభోజలో, గరుడదత్తుడు పథకం వెయ్యటం పూర్తయింది. ఈసారి అతడి పథకం లోమరిద్దరు భాగస్వాములు కలిశారు. ఒకడు, కోసలకు ఉత్తరాన వున్న నగదేశపు రాజూ, గరుడదత్తుడి బావమరిదీ అయిన నాగా కర్ణుడు. రెండవవాడు, నగదేశానికీ, కాంభో జకూ మధ్యన వున్నచాక్య దేశపు రాజు కుండిన వర్మ.

తానొక్కడే రెండు, మూడు సార్లు గూఢ చారుల ద్వారా ప్రయత్నించి భంగపడ్డ గరుడ దత్తుడు, ఈసారి మరికొంత సహాయం సంపా దించి, కోసల మీదికి దండెత్తి అయినా సరే, ఆ హారాన్ని చేజిక్కించుకోవాలనే ఉద్దేశంతో, మొదటగా తన బావమరిది అయిన నగదేశా ధిపతిని సంప్రతించాడు. నాగాకర్ణుడు, తన స్నేహితుడైన చాక్య రాజుకు కూడా ఇటువంటి ఉద్దేశమేవున్నదనీ,పైగా అతడివద్ద భిల్ల సైన్యం ఎక్కువగా వున్నది గనుక, అతడిని కూడా కలుపుకుంటే బాగుంటుందనీ సూచించాడు.

దీనికి ఫలితంగా, ఏవో ఉత్సవాల పేరిట నాగాకర్ణుడు, కుండినవర్మ కాంభోజలో సమా వేశమై, గరుడదత్తుడితో కలిసి మంతనాలు సాగించారు.

హారం గరుడదత్తుడు తీసుకునేటట్టూ, కోసలను మిగతా ఇద్దరూ సమంగా పంచుకునే

టట్టూ నిర్ణయమైంది. కాని, ఎవరికి వారే మిగతా వారిని వంచించి, హారాన్నీ, కోసలనూ కూడా దక్కించుకోవాలని పథకాలు వేసుకు న్నారు. తర్వాత కోసలను పడగొట్టటానికి వ్యూహ రచన ప్రారంభమైంది.

"మన ముగ్గురి సైన్యాలూ కలిస్తే ఎంతో, ఒక్క కోసల సైనికశక్తి అంత! అది మనం గుర్తుంచుకోవలసిన సంగతి," అన్నాడు నాగా కర్ణుడు.

"అంతేకాదు, రేపు కృష్ణ పాడ్యమి నాడు గురుకులం నుంచి బయలుదేరి, కీర్తిసింహుడు రాజధానికి తిరిగి వెళ్ళిపోతున్నాడు. అతడు గనక సైన్యాధిపత్యం వహిస్తే, మన పని ఇంకా కష్టతరమవుతుంది," అన్నాడు కుండినవర్మ.

"ఆ కీర్తిసింహుణ్ణే ముందు హతమార్చితే?" అని గరుడదత్తుడు ప్రశ్నించాడు.

"ఎలా?" అని అడిగారు మిగతా ఇద్దరూ అతృతగా.

"మెరికల్లాంటి ముగ్గురు భటుల్ని పంపించి, దొంగచాటుగా దారిలోనే అతణ్ణి చంపిద్దాం! కోసల రాజ్యమంతా యువరాజు మరణానికి శోకంలో మునిగి వుండగా, మనం హఠాత్తుగా దెబ్బ తీద్దాం," అన్నాడు గరుడదత్తుడు.

"ఇంతకంటే అద్భుతమైన ఉపాయం ఇంకొకటి వున్నది! కీర్తిసింహుణ్ణి దొంగదెబ్బ తీసి బంధించి, మర్యాదగా హారం ఇవ్వమనీ, లేకపోతే అతన్ని చంపేస్తామనీ, అతడి తండ్రిని బెదిరిద్దాం," అన్నాడు నాగాకర్ణుడు.

"అవును, అదే మంచి పద్ధతి! మనకు ఆ హారం ఎక్కడున్నదో తెలియదు. రాజు సుషేణు డికి కొడుకంటే ప్రాణాధికమైన ప్రేమ. అతడు చనిపోయాడనీ, మనమే చంపించామనీ తెలిస్తే, హారం ఎక్కడ వున్నదో తెలిపే ఆధారా లనుకూడా నాశనం చేస్తాడు. కొడుకు ప్రాణాల కోసం అంటే, తేలికగా ఆ హారాన్ని అయినా ఇచ్చేస్తాడు. హారం మన చేతికి రాగానే, కీర్తి సింహుణ్ణి చంపేద్దాం," అన్నాడు కుండినవర్మ.

ఇందుకు మిగతా ఇద్దరూ ఆమోదించారు. తరవాత, ముగ్గురు మెరికల్లాంటి భటుల్ని పంపించి, కీర్తిసింహుణ్ణి బంధించి, ఘాటైన మత్తు మందు ఇచ్చి కాంభోజకు తీసుకురావ టానికి నిర్ణయించారు. — (ఇంకావుంది)






# మణిప్రభావం

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజానవేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత కటిక చీకటిలో, గూబలూ, నక్కలూ, పిశాచాలూ తిరుగాడే ఈ శ్మశానం మధ్య, ఎన్నిసార్లు కార్యవైఫల్యం జరిగినా నిరాశ చెందని, నిన్ను చూస్తూంటే ఆశ్చర్యం కలుగుతున్నది. అయితే, ఇంతకూ నువ్వు సాధించదలచిన కార్యమేమిటో నేను ఊహించలేక పోతున్నాను. ఒక దేశపాలకుడుగా నీకు సంపదల విషయంలో లోటంటూ వుండదుగదా! ఒకవేళ పర రాజులను జయించదలిస్తే, అందుకు నీలాంటి బలపరాక్రమాలు గల రాజు స్వశక్తిపై ఆధారపడతాడుగాని, ఏ క్షుద్రదేవతోపాసనకో పూనుకోడు. నా అభిప్రాయంలో ఇక మిగిలింది, తాను ప్రేమించిన స్త్రీని వివాహమాడే విషయంలో ఎదురయ్యే

## బేతాళ కథలు



విషమ సమస్యలు. ఒకవేళ నువ్వు అలాంటి సమస్యల వలయంలో చిక్కి, పరిష్కారం కోసం వెదుకుతున్న వాడివైతే, ఆఖరిక్షణంలో కల్యాణీనగర యువరాజులా, అవివేకంగా ప్రవర్తించవనుకుంటాను. ఏదిఏమైనా, నీకు ముందుహెచ్చరికగా వుండేందుకు, ఆ యువ రాజు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

కల్యాణీనగరాన్ని కనకదత్తుడనే రాజు పాలించేవాడు. ఆయన ఏకైక కుమారుడైన మోహనగుప్తుడు మంచి స్ఫురద్రూపి. యుక్త వయస్కుడైన యువరాజును తమ అల్లుణ్ణి చేసుకోవాలని ఎందరో రాజులు ఉవ్విళ్ళూరారు. తమ కుమార్తెల చిత్రపటాలను కల్యాణీ నగరానికి పంపించారు. కానీ, వాటిలో ఏ యువరాణి చిత్రపటమూ యువరాజు దృష్టిని ఆకట్టుకోలేకపోయింది.

ఆస్థాన చిత్రకారుడైన రవివర్మ, మోహన గుప్తుడికి ప్రాణస్నేహితుడు. ఇద్దరూ సమవయస్కులు. అప్పుడప్పుడూ కాలక్షేపం కోసం యువరాజు, రవివర్మ మందిరానికి వెళ్ళేవాడు. ఒక నాటి సాయంకాలం అతడు అక్కడికి వెళ్ళిన సమయంలో రవివర్మ, ఒక చిత్రం ముందు నిలబడి కుంచెతో తుదిమెరుగులు దిద్దుతున్నాడు.

అది ఒక అద్భుత సౌందర్యరాశి అయిన స్త్రీ మూర్తిది. ఆ చిత్ర పటాన్ని చూసిన మోహన గుప్తుడు అబ్బురపడ్డాడు. అతడు రవివర్మను, "మిత్రమా! ఈసుందరి నీ ఊహాచిత్రమా లేక ఇందుకు ఆధారభూతమైన సుందరీమణి నీకెక్కడైనా తారసపడిందా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు రవివర్మ చిరునవ్వు నవ్వి, "నేను చిత్రించిన ఈ సుందరి మన రాజధానీ నగరంలోనే వున్నది. పేరు స్వప్నరేఖ, ఒకరైతు కూతురు. ఇంకా అవివాహిత," అని చెప్పాడు.

ఇది వింటూనే మోహనగుప్తుడు పరమానంద భరితుడైపోతూ, "ఆహాఁ! ఇటువంటి అద్భుత మోహనాంగిని భార్యగా చేసుకోలేని నా జీవితం వ్యర్థం!" అన్నాడు.

ఆ రాత్రి అతడికి నిద్రపట్టలేదు. కన్ను మూసినా, తెరిచినా స్వప్నరేఖ చిత్రమే కళ్ళ ముందు కనిపించసాగింది. రాత్రంతా కలత

నిద్రలోనే గడిపాడు. తెల్లవారుజామున మాగన్నుగా నిద్రపట్టింది.

అది ఒక పెద్ద కీకారణ్యం. మాంత్రికుడెవడో ఒకడు పులి మీద స్వారి చేస్తున్నాడు. అతడి వెనక చిత్రంలో వున్న స్వప్నరేఖ పోలికలు కలిగిన యువతి కూర్చుని వున్నది. అతణ్ణి మోహనగుప్తుడు గుర్రం మీద వెన్నాడసాగాడు. పులికీ, గుర్రానికీ మధ్య పదిబారల దూరం ఎంతకూ తరగడం లేదు. ఆ మాంత్రికుడికి పాతికేళ్ళ వయసుంటుంది. కండలు తిరిగిన శరీరంతో ఆరోగ్యంగా వున్నాడు. నల్లటి నిడుపాటి గడ్డం, కుడి చేతిలో మంత్రదండం, మెడలో రుద్రాక్ష మాలలతో పాటు బంగారు గొలుసుకు తాపడం చేసిన ఎర్రటి మణి వున్నది.

అలా కొంతసేపు స్వారి చేశాక, పులిని ఒక పెద్ద మర్రిచెట్టు వద్ద ఆపాడు మాంత్రికుడు. పక్కనే ఒక కొండ గుహ వున్నది. మాంత్రికుడు గుహలోకి వెళుతూంటే పులి, యువతి అతణ్ణి మౌనంగా అనుసరించారు.

మోహనగుప్తుడికి హఠాత్తుగా మెలుకువ వచ్చింది. తను అంతఃపురంలోని శయనమందిరంలో హంసతూలికాతల్పం మీద వున్నాడు. అంటే – ఇదంతా కల అన్నమాట! అంతలో తెల్లవారిన సూచనగా కోట కావలి భటుడు గంట కొట్టాడు.

తెల్లవారి బారెడు పొద్దెక్కే సరికి, వ్యాఘ్రదీపుడనే మాంత్రికుడొకడు, ఆ రాత్రి స్వప్నరేఖను అపహరించుకు పోయినట్టు, నగరంలో జనం గుంపులు గూడి చెప్పుకోసాగారు. ఈ





వార్త విని మోహనగుప్తుడు చాలా బాధపడ్డాడు. వ్యాఘ్రదీపుడు చాలా శక్తి మంతుడయిన మాంత్రికుడనీ, వాడి దగ్గర సమ్మోహన శక్తి గలిగిన ఒక మణివున్నదనీ ప్రతీతి. దాని ప్రభావంతో వాడు ఎంతటి వారినైనా సమ్మోహితులను చేయగలడని జనం కథలుగా చెప్పుకుంటారు.

ఇదంతా విన్న తర్వాత, మోహనగుప్తుడికి గత రాత్రి వచ్చిన కల, కల అనిగాక వాస్తవం అన్న నమ్మకం కలిగింది. వెంటనే అతడు ఎవ్వరికీ చెప్పకుండా గుర్రం ఎక్కి అరణ్యంకేసి వెళ్ళాడు.

మధ్యాహ్నం వరకూ అతడు తనకు కలలో కనిపించిన ప్రాంతం అంతా గాలించిన తర్వాత, ఓ చోట పెద్ద మర్రి చెట్టొకటి కనిపించింది. పక్కనే గుహకూడా వున్నది. మోహనగుప్తుడు గుర్రం దిగి, దాన్ని చెట్టుకు కట్టి గుహకేసి నడిచాడు.

గుహ ముందు పులి నిద్రమత్తుతో జోగుతున్నది. అతడికి కలలో వ్యాఘ్రదీపుడి మెడలో కనిపించిన మణి, ఇప్పుడు దాని మెడలో వేళ్ళాడుతున్నది. అది మోహనగుప్తుడి కాళ్ళ చప్పుడుకు కళ్ళు తెరిచి లేవబోయేంతలో, అతడు చేతనున్న ఖడ్గంతో ఒక్క వేటున దాని మెడ తెగనరికాడు.

పులి గిలగిల తన్నుకోసాగింది. మోహనగుప్తుడు చప్పున వంగి ప్రభావంగల మణిని తీసుకుని తన మెడలో వేసుకున్నాడు. తర్వాత కొంచెం ముందుకు నడిచి గుహలోకి తొంగి చూశాడు. పులిచర్మాలు కప్పిన ఒక ఆసనం మీద కొంచెం ఎడంఎడంగా వ్యాఘ్రదీపుడూ, స్వప్నరేఖా కూర్చుని వున్నారు.

ఇప్పుడేం చేయడమా అని మోహనగుప్తుడు ఆలోచిస్తున్నంతలో, వ్యాఘ్రదీపుడు, "స్వప్నరేఖా! గతంలో నేను మణిప్రభావంతో ఎన్నో అద్భుత కార్యాలు సాధించాను. నిన్ను కూడా ఆ మణి ప్రభావంతోనే ఇంటి నుంచి ఇక్కడికి తీసుకువచ్చాను. అయితే, దాని ప్రభావంతో నిన్ను నా దాస్నిగా చేసుకో దలచలేదు. అందుకే మణిని పులి మెడలో వేశాను. ఆ మణి నా మెడలో లేనప్పుడు నేనొక మామూలు మనిషిని. నీకిష్టమైతే నిన్ను అగ్నిసాక్షిగా వివాహ

మాడతాను. లేకుంటే క్షేమంగా నిన్ను ఇల్లు చేరుస్తాను," అన్నాడు.

ఆ మాంత్రికుడి ప్రవర్తన మోహనగుప్తుడికి విస్మయం కలిగించింది. స్వప్నరేఖ ఏం సమాధానం చెబుతుందో వినాలన్న ఆతృతలో అతడు గుహలోపలికి రెండడుగులు వేశాడు.

స్వప్నరేఖ ఒకసారి వ్యాఘ్రదీపుడి ముఖం కేసి చూసి తల వంచుకుని, "మీరీ మంత్ర తంత్ర శక్తులన్నిటినీ విడిచి, మనుషుల మధ్య గౌరవంగా జీవించదలిస్తే, మిమ్మల్ని వివాహ మాడడానికి నాకెలాంటి అభ్యంతరమూ లేదు," అన్నది.



మాంత్రికుడు ఆమోదసూచకంగా ఇందుకు తలాడించి, స్వప్నరేఖ చేతిని ఆప్యాయంగా తనచేతిలోకి తీసుకోబోయేంతలో మోహనగుప్తుడు వేగంగా వాళ్ళ ముందుకుపోయి, "స్వప్నరేఖా, ఆగు! ఈ మాంత్రికుడు పరమ దుష్టుడు, నీచుడు. వీణ్ణి వివాహమాడకు. నేను ఈ దేశపు యువరాజును. నన్ను వివాహ మాడితే కల్యాణీ రాజ్య పట్టమహిషివవుతావు!" అన్నాడు.

స్వప్నరేఖ యువరాజు మెడలో వున్న మణి ప్రభావం వల్ల, కలలో నడిచి వచ్చినట్లు మంత్ర ముగ్ధలా వయ్యారంగా వచ్చి, అతడి సరసన నిలబడింది.

ఇది చూసిమాంత్రికుడువిరగబడినవ్వాడు. యువరాజు వాడివైపు తీవ్రంగా చూస్తూ, "ఏమిటా వెర్రినవ్వు? అబలలను మణి ప్రభావంతో లోబరచుకున్న దుర్మార్గుడివి నువ్వు! నీకు చట్టబద్ధంగా ఉరిశిక్షవేసే అధికారం, ఈ దేశానికి రాజుగా నాకుంది. కానీ, దయ తలచి వదులుతున్నాను," అన్నాడు.

"ఏమన్నారు, ప్రభూ! మణి ప్రభావంతో అబలలను వశపరుచుకున్న దుర్మార్గుణ్ణని కదూ, తమ అభియోగం?" అంటూ వ్యాఘ్రదీపుడు మరొకసారి విరగబడి నవ్వాడు.

మాంత్రికుడి మాటలతో మోహనగుప్తుడు తీవ్రాలోచనలోపడ్డాడు. ఆలోచించేకొద్దీ అతడి మొహంలో రంగులు మారాయి.

అతడు మెడలో వున్న మణిహారాన్ని తీసి బలంగా నేల కేసి కొట్టాడు. అది ముక్కలు ముక్కలయింది.

అంతవరకూ మోహనగుప్తుడి పక్కన వున్న స్వప్నరేఖ, ఉలిక్కిపడి యువరాజు కేసివిం తగా చూసి, "ఈయనెవరు? ఈయన పక్కన ఎందుకు నిలబడ్డాను?" అని గొణుక్కుంటూ మాంత్రికుడి వద్దకు వెళ్ళింది. వెంటనే మోహన గుప్తుడు గుహ నుంచి బయటికి వచ్చి, గుర్రా న్నెక్కి రాజధానికి బయలుదేరాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, మోహన గుప్తుడు ఎంతో గాఢానురక్తి వుంటే తప్ప, స్వప్నరేఖను వివాహమాడాలని నిర్ణయించు కోడుగదా! అతడు పులిని చంపి, అలౌకిక ప్రభావం గల మణిని సంపాయించాడు. ఇప్పుడు స్వప్నరేఖ అతడి భార్య కావడానికి ఎలాంటి ఆటంకమూ లేదు. అలాంటి పరి స్థితిలో అతడు మణిని పగల గొట్టి, దుష్టుడైన మాంత్రికుడికి స్వప్నరేఖను అప్పగించి, రాజ ధానికి తిరిగి పోవడం అవివేకం కాదా? పైగా అపురూప శక్తులు గల మణిని ఎందుకు పగలగొట్టినట్టు? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో, నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "మాంత్రికుడు గతంలో దుష్టుడే కావచ్చు. కాని, స్వప్నరేఖ విషయంలో వాడు ఎంతో నాగరీకుడుగా, నిజాయితీపరుడుగా ప్రవర్తించాడు. స్త్రీ హృద యాన్ని మంత్రతంత్రాలతో గెలవడం నీచాతి నీచం అని తెలుసుకోవడం వల్లనే, వాడు మణిని పులి మెడలో వేశాడు. అయితే, ఆ మణిని ధరించి స్వప్నరేఖను ఆకర్షించిన యువరాజును చూసినప్పుడు, వాడికి నవ్వు ఆగింది కాదు. దానితో తన పొరబాటును గ్రహించిన మోహనగుప్తుడు, మణి ఎవడైనా స్వార్థపరుడి చేత బడకుండా వుండేందుకు దాన్ని వెంటనే పగలగొట్టాడు. యువరాజు ప్రవర్తనలో అవివేకం అనేది ఎంతమాత్రం లేకపోగా, అతడెంతో ఉదాత్తంగా, ధర్మసమ్మ తంగా, సమయస్ఫూర్తితో ప్రవర్తించాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం : రాఘవరాజు స్వర్ణలత రచన]





# తీరినకోరిక

నాగపుర రాజైన సమీరుడు, రాజ్యం చేసినంత కాలమూ ప్రజాకంటకుడిగా వుండి, అవసాన దశలో పశ్చాత్తాపంతో కుమిలిపోసాగాడు.

ఆయన తన చివరి క్షణాలలో కొడుకు మహేంద్రుణ్ణి దగ్గరకు పిలిచి, "నాయనా! ప్రజలు నా పాలనలో పడిన ఇక్కట్లను ఎన్నటికీ మరిచిపోరు, నన్ను క్షమించరు. నువ్వేం చేయగలవో నాకు తెలియదు! నేను పోయాక మాత్రం వాళ్ళు నన్ను గురించి గొప్పగా చెప్పుకునేలాగా చెయ్యి. లేకుంటే నా ఆత్మకు శాంతి అంటూ వుండదు," అని చెప్పి కన్నుమూశాడు.

మహేంద్రుడు, తండ్రిలాగా కాక దయాగుణం కలవాడు. అతడు బాగా ఆలోచించి, తండ్రి పేరుమీద నగరంలో ఒక ఉచిత భోజనశాలను, ఒక విద్యాలయాన్ని నిర్మించాడు.

కొన్ని దినాలు గడిచాక మహేంద్రుడు మారువేషంలో ముందు భోజనశాలను సందర్శించాడు. అక్కడ వందల మందికి భోజన సదుపాయాలు చకచకా జరుగుతున్నాయి. వాళ్ళందరూ తృప్తిగా భోజనం ముగిస్తున్నప్పటికీ, వాళ్ళ ముఖాల్లో ఏదో వెలితి కనిపిస్తున్నది. ఈ విషయం గురించి మహేంద్రుడు, ఒకణ్ణి అడిగితే, వాడు, "ఏముందీ, ఇంత మంచి ధర్మకార్యానికి ప్రజాకంటకుడైన ఆ సమీర రాజు పేరు పెట్టడంవల్ల, భోజనం మధ్యలో పంటికింద రాయి పడ్డట్టుగా వుంది!" అన్నాడు.

ఇది విని మహేంద్రుడు కలత పడ్డాడు. అతడు అక్కడి నుంచి తిన్నగా విద్యాలయానికి వెళ్ళేసరికి, అక్కడ అందరూ అధ్యాపకులే తప్ప ఒక్క విద్యార్థి కూడా లేడు.

మహేంద్రుడు ఆశ్చర్యపోతూ సంగతేమిటని, ఒక అధ్యాపకుణ్ణి అడిగాడు. అందుకా అధ్యాపకుడు, "అయ్యా! సమీరుడి పేరుతో వున్న ఈ విద్యాలయంలో చదివితే దుష్టబుద్ధులు తప్ప, విద్యాబుద్ధులు వంటబట్టవని, తల్లిదండ్రులు తమ పిల్లల్ని ఇక్కడికి

మల్లవరపు మనోహరరెడ్డి

పంపడానికి నిరాకరిస్తున్నారు," అని చెప్పాడు. ఈ జవాబుకు మహేంద్రుడు మరింతగా కలత చెందాడు. ఆయన ఆ రోజే భోజనశాల, విద్యాలయాలను మూయించివేసి, రాచ కార్యాల్లో తలమునకలవుతూ, తండ్రి కోరికను పూర్తిగా మరిచిపోయాడు.

కొంతకాలం గడిచాక, ఒక రోజు రాత్రి మహేంద్రుడు, సమీరుడు వచ్చి కన్నీరు కారుస్తున్నట్టుగా కలగన్నాడు.

తెల్లవారి మహేంద్రుడు తనకు వచ్చిన కల గురించి, మంత్రికి చెప్పాడు. అందుకు మంత్రి, "మహారాజా! దీని అర్థం, మీ తండ్రిగారు తన కోరిక తీర్చమని మిమ్మల్ని అభ్యర్థించడమే! ఎలాగైనా మీరు ప్రభువుల వారి కోరికను తీర్చండి," అని సలహా ఇచ్చాడు.

ఆ నాటి నుంచి మహేంద్రుడు ఎన్నో ప్రజోపయోగ కార్యాలు చేపట్టాడు. రాజ్యంలో భూమిశిస్తు సగానికి సగం రద్దయింది. ఎన్నో విద్యాలయాలు వెలిశాయి. ఉచిత భోజనశాలలూ, మారుమూల గ్రామాలకు్కూడా రహదారులూ ఏర్పడ్డాయి.

దీనితో అచిరకాలంలోనే మహేంద్రుడికి గొప్ప పేరుప్రఖ్యాతులు వచ్చాయి. ఈ దశలో, మంత్రి సమీరుడి కాంస్య విగ్రహాలు చేయించి, నగరపు కూడలి ప్రదేశాల్లోనూ, ఇతర చిన్న చిన్న పట్టణాల్లోనూ ప్రతిష్ఠింపజేశాడు. తర్వాత రాజు, మంత్రి కలిసి ప్రజలు ఏమనుకుంటున్నారో తెలుసుకునేందుకు మారువేషాల్లో రాజ్యంలో తిరగసాగారు.

అలా తిరుగుతూ వాళ్ళిద్దరూ, ఒక చిన్న పట్టణంలోని కూడలి ప్రదేశాన్ని చేరారు. అక్కడ ఒక పొరుగు దేశస్థుడైన బాటసారి, దారేపోతున్న పౌరుణ్ణి, "అయ్యా, ఈ విగ్రహం ఎవరిది?" అని సమీరుడి విగ్రహాన్ని చూపుతూ ప్రశ్నించాడు. దానికా పౌరుడు ఆనందంగా, "ఇదా? ఇది దేవుడిలాంటిమారాజుగారి తండ్రి, సమీరుడిది! ఆయన చలవవల్లే, మాకింత మంచి రాజు దొరికాడు," అన్నాడు.

ఆ మాటలువిన్న మహేంద్రుడు, ఇన్నాళ్ళకుతనతండ్రి కోరిక నేరవేరినందుకు ఆనందించి, ఆప్యాయంగా మంత్రి చెయ్యిపట్టుకుని రాజధానీనగరం కేసి బయలుదేరాడు.



# చందమామ అనుబంధం - 69

మనదేశపు చెట్లు:

## కొబ్బరి చెట్టు



కొబ్బరి చెట్టును కల్పవృక్షం అని చెబుతారు. విష్ణువు అవతారాలలో ఒకడయిన పరశురాముడు, దుష్ట శిక్షణ చేసిన తరవాత, గోకర్ణం అనే కొండ శిఖరంపై నుంచి తన గండ్ర గొడ్డలిని సముద్రంలోకి విసిరినప్పుడు, గొడ్డలిపడిన చోట కొంత భూభాగం జలం నుంచి పైకి లేచిందట. పరశురాముడు స్వర్గం నుంచి కొబ్బరి మొక్కను తెచ్చి, అక్కడ నాటాడట. గోకర్ణం నుంచి కన్యాకుమారి వరకు విస్తరించిన ఆ ప్రాంతం ఉత్తరోత్తరా కొబ్బరి చెట్లకు ప్రసిద్ధిగాంచిన కేరళ ప్రాంతంగా రూపొందిందని ఒక పురాణ కథ చెబుతుంది. కేరళ అంటే కొబ్బరిచెట్ల భూమి అని కూడా ఒక అర్థం ఉన్నది.

హిందువులు కొబ్బరికాయను చాలా పవిత్రంగా భావిస్తారు. పూజలు, పురస్కారాలు, శుభకార్యాలు కొబ్బరికాయలు లేకుండా జరగవు.

సముద్ర తీర ప్రాంతాలలో కొబ్బరి చెట్లు బాగా పెరుగుతాయి. అందుకే సముద్రతీర ప్రాంత ప్రజల జీవితాలలోనూ; పండుగలూ, పబ్బాలలోనూ కొబ్బరికాయ ప్రధాన పాత్ర వహిస్తున్నది. ఉదాహరణకు మహారాష్ట్రలో వర్షాకాలం ముగిసేప్పుడు 'నారియల్ దివస్' అనే పండుగ జరుపుకుని వరుణదేవుడికి కృతజ్ఞతతో కొబ్బరికాయలు కొడతారు.

కొమ్మలు లేకుండా 18 నుంచి 25 మీటర్ల ఎత్తు వరకు ఎదిగే కొబ్బరిచెట్టుకు పెద్దపెద్ద సన్నటి ఆకులు ఉంటాయి. రెండువైపులా రేకులు గల ఆకులు ఒక్కొక్కటి దాదాపు 2.5 మీటర్ల పొడవు వుంటుంది. మధ్య కాండం చుట్టూ ఆకులు ఈకెల్లా వస్తాయి. ఆకులు మొదట లేత పసుపు రంగుతో ముడుచుకుని వుంటాయి. పెద్దవై విచ్చుకున్నాక ముదురు ఆకుపచ్చరంగుతో వుంటాయి. ఆకుల మొదళ్ళలో పసుపుపచ్చటి పూలు పూచి, గెలలు గెలలుగా కాయలు కాస్తాయి.

కొబ్బరి బోండాం, కాయల ఉపయోగం గురించి కొత్తగా చెప్పనవసరం లేదు. మొదట లేతగా వుండే కొబ్బరి ముదిరి గట్టిపడుతుంది. కొబ్బరి నుంచి నూనె తీస్తారు. కొబ్బరి ఆకు, ఈనె, పీచు, టెంక, అంటూ కొబ్బరి చెట్టులో ప్రతి భాగం ఉపయోగపడుతుంది. కాబట్టి, దీనికి వ్యాపార రీత్యా విలువ ఎక్కువ. దీనిని కల్పవృక్షం అనడానికి ఇది కూడా ఒక కారణం.




# పవిత్ర బైబిలు

క్రైస్తవుల పవిత్ర గ్రంథమైన బైబిలు — పాత నిబంధనలు (ఓల్డ్ టెస్టామెంట్) కొత్త నిబంధనలు (న్యూ టెస్టామెంట్) అనే రెండు భాగాలు కలిగి ఉన్నది. పాత నిబంధనలు మానవజాతి ప్రాచీన చరిత్రను వివరిస్తుంది. జూడాయిజం అనే పురాతన మతాన్ని అవలంబించిన హిబ్రూ భాష మాట్లాడే యూదులు విశ్వసించిన చరిత్ర ఇది. దీనిని క్రైస్తవులు కూడా చరిత్రగా అంగీకరిస్తారు; ఇందులోని కథలనూ, సూక్తులనూ పవిత్రంగా భావిస్తారు.

కొత్త నిబంధనలు ఏసుక్రీస్తు బోధనలను 'అపోజల్స్' అనే ఆయన ప్రత్యక్ష శిష్యులు చేసిన మహత్కార్యాలనూ, సేవలనూ వివరిస్తుంది.

సృష్ట్యాదిని గురించి పాత నిబంధనలు ఇలా చెబుతుంది: దేవుడు స్వర్గాన్నీ, భూమినీ సృష్టించడానికి ప్రారంభించినప్పుడు భూమి, నిర్దిష్ట ఆకార రహితంగానూ, అస్తవ్యస్తమైన ముద్దగానూ, నల్లటి ఆవిరులు చిమ్ముతూ ఉండేది. దైవశక్తి దానిని ఆవరించింది.

రాజులను గురించీ, మహనీయులైన వ్యక్తులను గురించీ పాత నిబంధనలు ఎన్నో గాథలను తెలియజేస్తుంది. ఈజిప్టులో బానిసలుగా పట్టుబడిన యూదుల బాధలను, కడగండ్లను వాళ్ళు ఇజ్రాయెల్‌కు తిరిగి రావడానికి పడిన తపన, వేదన; ఆఖరికి మోసస్ వాళ్ళను అక్కడికి తీసుకు వెళ్ళిన సంఘటన పాతనిబంధనలలో వివరించబడింది.

పాత నిబంధనలలో మరెన్నో అనుభవ గాథలు, నీతి కథలు ఉన్నాయి. ఉదాహరణకు సుప్రసిద్ధ మయిన 'దుబారా తనయుడి కథ' కూడా అందులోనిదే. దుబారా ఖర్చులకు మరిగిన

PARLE



PARLE
mango bite

NAME: ..................................................

SCHOOL: ..................................................

STANDARD: .................... DIVN: ....................

SUBJECT: ..................................................

PARLE
Parle-G

NAME: ..................................................

SCHOOL: ..................................................

STANDARD: .......... .......... DIVN: ....................

SUBJECT: ..................................................



NAME: ..................................................

SCHOOL: ..................................................

STANDARD: .................... DIVN: ....................

SUBJECT: ..................................................

PARLE
big chief
BANANA · MANGO · ORANGE

NAME: ..................................................

SCHOOL: ..................................................

STANDARD: .................... DIVN: ....................

SUBJECT: ..................................................

PARLE
Super milk

PARLE
POPPINS

NAME: ..................................................

SCHOOL: ..................................................

STANDARD: .................... DIVN: ....................

SUBJECT: ..................................................

NAME: ..................................................

SCHOOL: ..................................................

STANDARD: .................... DIVN: ....................

SUBJECT: ..................................................

PARLE
Melody

PARLE
POPPINS

NAME: ..................................................

SCHOOL: ..................................................

STANDARD: .................... DIVN: ....................

SUBJECT: ..................................................

kismi TOFFEE BAR PARLE

NAME: ..................................................

SCHOOL: ..................................................

STANDARD: .................... DIVN: ....................

SUBJECT: ..................................................

ఒక యువకుడు తండ్రితో గొడవ పడి ఆస్తిలో తనవాటా పంచుకుని విడిపోయి, దుబారాగా ఖర్చు చేసి ఉన్నదంతా పోగొట్టుకుని కష్టాల పాలవుతాడు. బాధలకు తట్టుకోలేక ఆఖరికి మరొక మార్గం కనిపించక తండ్రి ఇంట్లోనే సేవకుడుగా పనిచేయడానికి తిరిగి వస్తాడు. అయితే, కన్నతండ్రి అతన్ని ప్రేమతో ఆదరిస్తాడు. చనిపోయిన కొడుకు మళ్ళీ ప్రాణంతో లేచివచ్చినట్టు ఆనందిస్తాడు!

కొత్త నిబంధనలలో ఏసుక్రీస్తు బోధనలు పొందుపరచబడ్డాయి. ఏసుక్రీస్తు తన అనుచరులకు ఎదుటి వారి పట్ల ప్రేమ, వినయగుణం, సహనం అలవరచుకోవాలని బోధించాడు. ఎవరయినా ఒక చెంప మీద కొడితే రెండవ చెంప కూడా చూపే క్షమాగుణం కావాలన్నాడు. మనమందరం అజ్ఞానులమే కాబట్టి, ఎదుటివారి చర్యల మీద న్యాయ నిర్ణయం చేసే అధికారం మనకు లేద న్నాడు ఏసుక్రీస్తు.

అద్భుతాలు చేసి చూపే వాళ్ళపట్ల, కపట ప్రవక్తల పట్ల జాగ్రత్తగా వ్యవహరించాలని ఏసుక్రీస్తు హెచ్చరించాడు. దేవుడి మీద దృఢమైన విశ్వాసం జీవితానికి పునాది వంటిది. అటువంటి వాళ్ళ జీవితం బలమైన కొండరాళ్ళ పునాదులమీద నిర్మించిన సురక్షితమైన ఇల్లు వంటిది. విశ్వాసం లేనివారి జీవితాలు ఇసుక మీద కట్టిన ఇళ్ళు వంటివి. ఏ తుఫాను వీచినా, ఎలాంటి చలనం కలిగినా అవి కూలిపోతాయి!

ప్రపంచంలో ఎక్కువ ప్రాచుర్యం గల గ్రంథాలలో బైబిలు ప్రధానమయినది. క్రైస్తవులే కాకుండా ఇతర మతస్థులు కూడా దీనిని చదవడం చెప్పుకోతగ్గ విశేషం!



# మీకు తెలుసా?

1. శ్రీహరికోట ఎక్కడ ఉన్నది? అది ఇటీవల ఎందుకు ప్రసిద్ధి గాంచింది?
2. ఒలింపిక్ చిహ్నంలోని ఐదు గీతల రంగులు ఏవి?
3. మనదేశంలో మొట్టమొదటి సినిమాహాలు ఏది? ఎప్పుడు, ఎక్కడ నిర్మించబడింది?
4. న్యూయార్క్ నగరం ఒక నదీముఖంలో నెలకొని ఉన్నది. ఆ నది ఏది?
5. ఆర్యసమాజ స్థాపకుడు ఎవరు?
6. ప్రపంచంలోకెల్లా పెద్ద సముద్రం ఏది? పెద్ద మహాసముద్రం ఏది?
7. ఐక్యరాజ్య సమితి జనరల్ అసెంబ్లీ మొట్టమొదటి మహిళా అధ్యక్షులు ఎవరు? ఎప్పుడు ఎన్నికయ్యారు?
8. కుట్టుమిషను కనుగొన్న వారెవరు?
9. జంతర్ – మంతర్ అంటే ఏమిటి? అది ఎందుకు ప్రసిద్ధి గాంచింది?
10. సామాన్య వనితను వివాహమాడడం కోసం సింహాసనాన్ని వదులుకున్న బ్రిటిష్ రాజు ఎవరు?
11. సాహిత్య అకాడెమీ, సంగీత నాటక అకాడెమీ, లలితకళా అకాడెమీ ప్రధాన కార్యాలయాలు ఒకే భవనంలో ఉన్నవి. అది ఏది? ఎక్కడ ఉన్నది?
12. ఆఫ్రికా ఖండంలోని అతి పెద్ద నగరం ఏది?
13. 'విజార్డ్ ఆఫ్ హాకీ' అని ప్రసిద్ధి గాంచిన వారెవరు?
14. మనదేశం నుంచి మొట్టమొదట వెలువడిన వార్తా పత్రిక ఏది? ఎక్కడి నుంచి ప్రచురించబడింది?
15. దాదాసాహెబ్ ఫాల్కే అవార్డ్ ప్రథమ గ్రహీత ఎవరు?
16. మార్క్ ట్వైన్ అసలు పేరు ఏమిటి?
17. 'రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా'ను ఎప్పుడు స్థాపించారు?

## సమాధానాలు

1. ఆంధ్ర సముద్ర తీరంలో ఉన్న దీవి. రోహిణి, ఎస్. ఎల్.వి. రాకెట్లను ఇక్కడి నుంచే ప్రయోగించారు.
2. నీలం, నలుపు, ఎరుపు, పసుపు, ఆకుపచ్చ.
3. ఎలిఫిన్‌స్టోన్ పిక్చర్ ప్యాలస్, బొంబాయిలో. 1907వ సం॥లో.
4. హడ్సన్.
5. దయానంద సరస్వతి.
6. చైనా సముద్రం, పసిఫిక్ మహాసముద్రం.
7. విజయలక్ష్మి పండిట్, 1953లో.
8. ఆధునిక ఆకారంలో 1867వ సం॥లో ఎలియాస్; ఆధారసూత్రం కనుగొన్నది థామస్ సెయింట్. 1790లో.
9. జైపూర్ రాజు రాజా సవాయ్ జైసింగ్ జైపూర్‌లోనూ, ఢిల్లీలోనూ నిర్మించిన రెండు నక్షత్ర గణితశాలలు. అంతరిక్షంలోని నక్షత్రాలనూ, గ్రహాలనూ పరిశీలించడానికి ఉపయోగపడేవి.
10. ఎనిమిదవ కింగ్ ఎడ్వర్డ్.
11. రవీంద్ర భవన్. న్యూఢిల్లీలో.
12. ఈజిప్టు రాజధాని కైరో.
13. మనదేశానికి చెందిన ధ్యాన్‌చంద్.
14. హిక్కీస్ గజెట్. 1779వ సం॥లో కలకత్తా నుంచి.
15. దేవికారాణి రోరిక్.
16. శామ్యుల్ క్లెమెన్స్.
17. 1935లో.



# దొంగచుట్టం

విల్లుపురంలోని వితలుకు, సావిత్రితో కొత్తగా పెళ్ళయింది. సావిత్రి ఉమ్మడి కుటుంబంలో నుంచి వచ్చిన పిల్ల. పైగా ఆ కుటుంబంలో ఒక్కగానొక్క ఆడపిల్ల. చిన్నప్పటి నుంచి ఆమె తల్లి, "ఇది తాతయ్య ముద్ద! ఇది నాన్నమ్మ ముద్ద!" అంటూ ఇంటిల్లిపాది పేర్ల మీద కూరి కూరి తినిపిస్తూండేది. దాంతో సావిత్రి మంచి తిండిపుష్టి వున్న అమ్మాయిగా ఎదిగింది.

పెళ్ళి కాకముందు వితలు స్వయంగా వంట చేసుకునేవాడు. సావిత్రి కాపరానికి రాగానే అతను, ఆమెకు వంటింట్లో ఏవి ఎక్కడ వున్నాయో చూపించి, "ఈ చిన్న రాగి లోటా బియ్యం వండుకుంటే నాకు ఒక పూటకు సరిపోయేది. ఈరోజు నుంచీ దీనితో రెండు కొలతలు పోయి!" అంటూ ఆమెకు బియ్యం డబ్బాలో వున్న లోటా చూపించాడు. "అలాగేనండీ!" అన్నది సావిత్రి.

వారం రోజులు గడిచినై. రాత్రి పడుకో బోయేముందు తిండి లేకపోవడంతో సావిత్రి నిద్రపట్టక నానా అవస్థా పడి, ఎనిమిదవ రోజు అర్ధరాత్రివేళ భర్త గాఢనిద్రలో వున్నాడని రూఢిపరుచుకుని వంటగదిలోకి వెళ్ళింది. అక్కడ ఒక మూలగా వున్న రెండు కొబ్బరి కాయలు కొట్టి, కొబ్బరి పాలతో బియ్యం పాయసం చేసుకుని తృప్తిగా తిన్నది.

ఆరోజు మొదలు సావిత్రి ప్రతిరోజూ అర్ధరాత్రి లేచి వంటింట్లో తనకు కావలసినవి చేసుకుని రహస్యంగా తింటూండేది.

ఒకరోజు రాత్రి ఆమె పొంగలి చేసుకుని, గిన్నెడు పొంగలి విస్తరాకులో గుమ్మరించింది. తర్వాత, పొంగలి చల్లారేలోగా పాత్రలు కడిగి తెచ్చుకోవచ్చని పెరట్లో బావి దగ్గరకు వెళ్ళింది. ఆమె పాత్రలు కడిగి వంటింట్లోకి తిరిగివస్తూనే, అక్కడ తచ్చాడుతున్న మనిషిని చూసి కెవ్వుమన్నది.

మాచిరాజు కామేశ్వరరావు



"నేను పరమ భయంకరుడైన దొంగను. మరొకసారి అరిచావో, పీక నొక్కెయ్యగలను," అంటూ హెచ్చరించాడు దొంగ.

ఈ హడావిడికి పక్క గదిలో నిద్రపోతున్న వితలుకు నిద్రాభంగమై, "సావిత్రీ! ఎవరక్కడ? ఏవో మాటలు వినబడుతన్నై," అని కేక వేశాడు.

భర్త లేచివస్తే, తన దొంగతిండి బయట పడుతుందనే భయంతో సావిత్రి లేని ధైర్యం తెచ్చుకుని దొంగతో, "అదుగో, మా ఆయన వస్తున్నాడు! ఆయన చూపులకలా వుంటాడు గాని, కోపం వచ్చిందో నీ తల గోటితో గిల్లి నీచేతుల్లో పెట్టగలడు. బీరాలకు పోక విస్తరి ముందు కుదురుగా కూర్చో," అంటూ పీట వేసి గుడ్లురిమింది.

ఈ పరిణామానికి దొంగ నివ్వెరపోతూ చప్పున విస్తరి ముందు కూర్చున్నాడు. అంతలో వితలు గదిలోకి వచ్చాడు. సావిత్రి అతడితో, "మాదగ్గర చుట్టాలబ్బాయి. వరుసకు నాకు తమ్ముడవుతాడు. ఏదో పనిమీద పట్నం వెళు తున్నాడట!" అన్నది.

ఆ మాటలతో దొంగ తేరుకుని, "నమ స్కారం, బావగారూ! ఆ కాలంలో ఊరి పక్క ఏరు పొంగడంతో అక్క పెళ్ళికి రాలేకపో యాను. పొద్దు పోయింది వద్దంటున్నా, అక్క వినిపించుకోకుండాపొంగలిచేసింది," అన్నాడు.

ఇంతలో వీధి తలుపు చప్పుడయింది. వితలు వెళ్ళి తలుపు తీశాడు. ఇద్దరు రక్షక భటులు అతడితో, "ఒక దొంగను తరుముతూ ఇటువచ్చాం. మీ ఇంట్లో దీపం వెలుగు చూసి తలుపు తట్టాం," అన్నారు.

దానికి వితలు, "ఇటుకేసి ఏ దొంగా రాలేదు. రాక రాక వచ్చిన నా బావమరిదితో, అతడి అక్క ఏదో పిచ్చాపాటీ మాట్లాడు తున్నది," అన్నాడు.

రక్షకభటులు మారు మాట్లాడకుండా వెళ్ళిపోయారు. తిరిగి వచ్చిన భర్తతో సావిత్రి, "మా తమ్ముడు మిమ్మల్ని చూడడం అయింది కాబట్టి, ఇప్పుడే బయల్దేరి తెల్లవారేసరికి పట్నం చేరతాడట!" అన్నది.

అయితే, వితలు అందుకొప్పుకోక, "ఇంకా నయం! రాకరాక మీవైపు చుట్టం వస్తే, అర్ధ రాత్రివేళ సాగనంపుతావా? మీ తమ్ముడికి

ముందు గదిలో మంచం వెయ్యి. ప్రయాణం సంగతి తెల్లవారాక చూడవచ్చు," అన్నాడు.

విధిలేక దొంగకు వీధి గదిలో మంచం వేసి, సావిత్రి వాడితో, "అప్పులవాళ్ళన్నా, దొంగలన్నా మా ఆయనకు బొత్తిగా పడదు. వాళ్ళు కంటబడగానే కత్తిపీట చేతికి తీసుకుంటాడు. నిన్ను మా ఆయన్నుంచి నేను కాపాడితే, రక్షకభటుల నుంచి నిన్నాయన కాపాడాడు. ఆ కృతజ్ఞతతో, ఇక ఈ ఇంట ఏదైనా దొంగిలించాలని ప్రయత్నించకు. మేం పడుకోగానే చిన్నగా వీధి తలుపు తెరుచుకుని వెళ్ళిపో. తెల్లవారాక, ఏడీ నీ తమ్ముడని మా ఆయన అడిగితే, ఏదో సర్దిచెప్పుకుంటాను," అని తన గదిలోకి వెళ్ళిపోయింది.



అయితే, తెల్లవారుజాము దాకా ఆమెకు నిద్రపట్టలేదు. మళ్ళీ మెలుకువ వచ్చేసరికి తెల్లగా తెల్లవారిపోయింది. వితలు ఇంకా నిద్రలోనే వున్నాడు. చప్పున లేచి వీధి గదిలోకి వచ్చిన ఆమె, దొంగ మంచం ఖాళీగా వుండడం చూసి తేలిగ్గా నిట్టూర్చింది. తిరిగి వెళ్ళబోతూ ఏదో అనుమానం వచ్చి పెట్టెలున్న గదిలోకి తొంగిచూసి కెవ్వుమన్నది.

ఆ గది అంతా చిందరవందరగా వున్నది. పెట్టెలో ఆమె పట్టుచీరలు, నగలు లేవు. ఆమె కేకలకు పరుగెత్తుకొచ్చాడు వితలు.

"ఆ దొంగ మన ఇల్లంతా దోచేశాడండీ!" అన్నది సావిత్రి కళ్ళనీళ్ళతో. "దొంగా! ఎక్కడ?" అన్నాడు వితలు.

"రాత్రి వచ్చింది, మా చుట్టం కాదండీ, వాడొక దొంగ!" అన్నది సావిత్రి కన్నీళ్లతో.

"మరి, దొంగను తమ్ముడంటూ చెప్పావెందుకు?" అని కోపంగా అడిగాడు వితలు.

అప్పుడు సావిత్రి, తను రాత్రివేళ రహస్యంగా వండుకుతినే సంగతి అతడికి చెప్పి, "మీకు తెలియకుండా ఇలాంటిపనులు చేసినందుకు, నాకు తగిన శాస్తి జరిగింది," అన్నది.

వితలు నవ్వి, "ముందు కళ్ళు తుడుచుకో! నీ నగలూ, చీరలూ ఎక్కడికీ పోలేదు. దొంగ రాసిపెట్టిపోయిన ఉత్తరం చదువు," అంటూ సావిత్రికి ఒక కాగితం ఇచ్చాడు.

అందులో దొంగ ఇలా రాశాడు: నేను మంచి ఉద్యోగం దొరకలేదన్న కసితో, చిన్న

ఉద్యోగాలు చేయడం అవమానంగా భావించి, మొట్టమొదటిసారిగా ఈరోజే దొంగతనానికి బయలుదేరాను. అయితే, రక్షకభటుల్ని చూడగానే, ఏ నేరం చేయకపోయినా, మనసులో అపరాధ భావం వుండడం వల్లనేమో-పరిగెత్తి మీ ఇంట్లో దూరాను. అక్క క్షమించాలి – తన దొంగతిండి బయటపడకుండా వుండేందుకు, దొంగను చుట్టంగా పరిచయం చేసింది. ఆ దొంగను ఇంట్లో వుండమనడమే కాకుండా, రక్షకభటులతో కూడా మీరు అబద్ధంచెప్పేలా చేసింది. అక్క తను చేసిన చిన్న దొంగ పనికి ఇన్ని అవస్థలు పడవలసి వచ్చింది. ఇక నిజమైన దొంగ పట్టుబడకుండా తిరగాలంటే, ఎన్ని ప్రమాదాలు ఎదుర్కోవాలో, ఎన్ని నేరాలు చేయాలో అని భయం వేసింది, నాకు. దొంగ బతుకులో మనశ్శాంతి అనేది వుండదని అర్థమయింది. కష్టపడి ఏ కొద్దిగా సంపాదించుకున్నా గౌరవంగా, తృప్తిగా బతకవచ్చన్న సత్యం తెలిసి వచ్చింది. నాలో మార్పు తెచ్చిన అక్కలో మార్పు రావాలనే, ఈ ఉత్తరం!

సావిత్రి ఉత్తరం చదివి కళ్ళు తుడుచుకుంటూ, "మీకు తెలియకుండా ఇన్నాళ్ళూ ఎంత అవివేకంగా ప్రవర్తించానండీ! నన్ను క్షమిస్తారుగా?" అన్నది.

"క్షమించడమా! ఎందుకు?" అంటూ వితలు, సావిత్రి చేతిలోని ఉత్తరం తీసుకుని, "ఇందులో క్షమించవలసిందేమీ లేదు. నీ పుట్టింటి అలవాటే ఇక్కడా కొనసాగించావు. నీ నగలూ, చీరలూ అన్నీ వసారా గదిలో దాచాను. పొద్దున నీకంటే ముందే లేవడం వల్ల, నీ దొంగచుట్టం రాసిపోయిన ఉత్తరం నాకంటబడింది. నువ్వు వచ్చిన రోజునే నీ తిండిపుష్టి సంగతి, ఆవకాయజాడీలు అటకమీద పెడుతూ, ఐదారులోటాల బియ్యం నువ్వు వండబోవడం చూసి గ్రహించాను. ఇంక దాపరికమెందుకు? నువ్వు వండుకు తినే వంటకాలు, మధ్యమధ్య నాకూ రుచి చూపిస్తూ వుంటే, సంతోషిస్తాను," అన్నాడు.

జరిగినదానికి భర్త తనను తప్పు పట్టకపోగా, ఎంతో ప్రేమాభిమానాలు చూపినందుకు సావిత్రి పరమానందం చెందింది.






# మంచి కుటుంబం

విశ్రాంతిపురం అనే గ్రామంలో, సోమన్న అనే రైతు వుండేవాడు. ఆయనకు తాతల కాలం నుంచి సంక్రమించిన పొలం వున్నది. కొడుకు భూషణం ఆయనకు వ్యవసాయపనుల్లో సాయపడుతూండేవాడు. గ్రామంలో సోమన్న కంటే ఆస్తిపరులైన రైతులు చాలామంది వున్నారు. అయినా మంచితనం, పరోపకార బుద్ధి కారణంగా సోమన్నను గ్రామంలో అందరూ చాలా గౌరవించి, ఆయన సలహాల కోసం వస్తూండేవాళ్ళు.

ఒకసారి సోమన్న పనిమీద పట్నం వెళ్ళాడు. పట్టణానికీ ఆయన వుండే గ్రామానికీ మధ్య ఒక నది వున్నది. పట్నం వెళ్ళాలంటే పడవ మీద నది దాటాలి. ఎప్పుడైనా నదిలో వరద ఉధృతంగా వున్నప్పుడు పడవ నదికి ఏదో ఒక ఒడ్డున వుండిపోయేది.

సోమన్న వెళ్ళిన పని ముగించుకుని, తిరిగి తన గ్రామానికి ప్రయాణమయ్యేంతలో నదికి హఠాత్తుగా వరద వచ్చింది. ఆ వరద వారం, పది రోజులకుగాని తగ్గదని తెలుసుకున్న సోమన్న, చుట్టుదారిన తన గ్రామం చేరేందుకు కిరాయి ఎద్దుబండి తోలే గవరయ్య దగ్గరకు వెళ్ళాడు.

గవరయ్య సంగతి తెలుసుకుని బండిని సిద్ధం చేస్తున్నంతలో, విలువైన దుస్తులు ధరించి సంపన్నుడిలా వున్న ఒక యాభైఏళ్ళ వ్యక్తి అక్కడికి వచ్చి, గవరయ్యతో, "ఏం, గవరయ్యా! నీ కోసం మా పనివాణ్ణి పంపాను, నువ్విక్కడున్నావా? అమ్మాయి పెళ్ళి సంబంధంకోసం విశ్రాంతిపురం వెళ్ళాలి. ఈ రోజు చాలా మంచిదని పురోహితుడు చెప్పాడు," అన్నాడు.

అంతగా బేరాలు లేని సమయంలో, ఒకేసారి ఇద్దరు ప్రయాణీకులు దొరికినందుకు గవరయ్య సంతోషిస్తూ, "అయ్యా, కనకయ్య గారూ, రండి!" అనిసోమన్ననుచూపిస్తూ, "వీరూ

జె. ఉదయనాగ శిరీష

విశ్రాంతిపురానికే వస్తున్నారు. మీరు వెళ్లా లను కుంటున్న పెళ్ళిసంబంధం వారింటికి, వీరి నుంచి సులభంగా దారి తెలుసుకో వచ్చు," అన్నాడు.

ఎద్దుబండి బయలుదేరింది. మాటల సందర్భంలో సోమన్న, కనకయ్యను గురించిన వివరాలు తెలుసుకున్నాడు. కనకయ్య పట్నంలో పెద్ద వ్యాపారి. అయనకొక్కతే కూతురు. విశ్రాంతిపురంలో పెద్ద వ్యవసాయ దారుడైన రాజన్న కొడుక్కు తన కూతురు నివ్వాలని బయలుదేరాడు.

ఆయన రాజన్న గురించిన వివరాలు అడిగితే సోమన్న, "కనకయ్య గారూ! తిన బోతూ రుచులడగడమెందుకు? పెళ్ళి సంబంధాల విషయంలో, వాళ్ళూ వీళ్ళూ చెప్పే మాటల కంటే, స్వయంగా మాట్లాడి తెలుసు కోవడం మంచిది. ఏది చెప్పడానికైనా నేను నోరు విప్పదలచలేదు. కారణం, నా కొడుకు పెళ్ళికెదిగున్నాడు. ఏ కారణాల వల్లనైనా మీ కూతుర్ని రాజన్న కొడుక్కు ఇవ్వకపోతే, నేనే ఈ పెళ్ళిసంబంధం చెడగొట్టానని ఆయన అనుకోవచ్చు," అన్నాడు. సోమన్న మాటలు విని కనకయ్య, అతడి నిజాయితీ, దాపరికం లేని మాటతీరూ గురించి ఆలోచిస్తూండగా బండి ఊరి పొలిమేరలోకి ప్రవేశించింది.

ఆ సమయంలో ఒకడు, ఒక ముసలి ఎద్దును అక్కడికి దాపుల వున్నకొండ ప్రాంతం కేసి బలవంతంగా తోలుకుపోతున్నాడు.

సోమన్న బండిని ఆపించి, వాడు రాజన్న పాలేరని గుర్తించి, "ఒరేయ్, ఇది రాజన్న



ఎద్దు గదా! ఆ కొండలూ గుట్టలకేసి ఎందుకు తోలుకు పోతున్నావు?" అని అడిగాడు.

దానికి పాలేరు, "అయ్యా, ఎద్దు బాగా ముసలిదై పోయింది గదా! పొలం పనులకు బొత్తిగా పనికిరావడం లేదు. మేత దండగ, కొండ ప్రాంతానికి తరిమెయ్యి. అక్కడ బతికినన్నాళ్ళు బతుకుతుంది, తర్వాత చస్తుంది, అన్నాడు యజమాని," అని చెప్పాడు.

ఆ జవాబుకు సోమన్న నొచ్చుకుని, "ఒరే, వయసులో వుండగా అది మనకు చేసిన సేవ మరచిపోకూడదు. రాత్రి తెల్లవారేలోగా దాన్ని ఆ కొండల్లో ఏ నక్కో, చిరుతపులో తినేస్తుంది. దాన్ని నా పశువుల పాకలో కట్టేసి, మిగతా వాటితో పాటు మేత వేస్తాను. నీ యజమాని ఏమన్నాఅంటే నే చెబుతాను.వెనక్కు తోలుకొచ్చి, నా పశువులపాకలో కట్టెయ్యి," అన్నాడు.

పాలేరు, తన యజమాని ఏమంటాడో అని భయపడుతూనే, సోమన్న మాట కాదనలేక బండితో పాటే వెనగ్గా ముసలి ఎద్దును తోలుకొచ్చి సోమన్న పశువుల పాకలో కట్టేశాడు.

సోమన్న బండిని దిగుతూండగానే, అప్పటి వరకూ ఇంటిముందు అరుగు మీద కూర్చుని వున్న ఒక ముసలాయన లేచి ముందుకు వస్తూ, "ఒరేయ్, సోమన్నా! నా కొడుకులు ఎలాంటివాళ్ళో నీకు కొంత తెలుసు కదా! నిన్న వాళ్ళిద్దరూ ఏకమై, నన్ను ఇంట్లోంచి గెంటేశారు. నేను నీ ఇంటికొచ్చాను. నువ్వు పొమ్మనవనే ధైర్యం వుందిరా!" అన్నాడు.

సోమన్న ఆ ముసలాయన చేతులు రెండూ పట్టుకుని, "అదేంటి బాబాయ్! మా



నాన్న ఒకటీ, నువ్వొకటీనా. నా ఇంట్లో వుండు. మానాన్నేబతికివచ్చాడనుకుంటాను," అన్నాడు.

తర్వాత సోమన్న బండిలో కూర్చుని వున్న కనకయ్యతో, "అయ్యా! కాస్త మంచి తీర్థంపుచ్చుకుని శ్రమ తీర్చుకున్నాక, రాజన్న గారింటికి వెళుదురుగాని," అన్నాడు ఎంతో మర్యాదగా.

కనకయ్య బండి దిగాడు. ఇంతలో పొలం నుంచి వచ్చిన సోమన్న కొడుకు, తండ్రిని చూసి సంతోషంగా, "నదికి వరద రావడంతో పడవలు నిలిచిపోయి, పట్నంలో ఎంతగా ఇబ్బంది పడిపోతున్నావో అని భయపడ్డాను. సరే, ఇంతకీ చిన్నతాత ఏమంటాడు? నువ్వొచ్చేదాక ఇంట్లోకి రానని అరుగుమీద కూర్చున్నాడు. తమ్ముళ్ళు సుందరం, భగవంతం కన్నతండ్రి అన్న కనికరం లేకుండా చిన్న తాతయ్యనిలా ఇంట్లోంచి తరిమెయ్యడం చూస్తూంటే, వాళ్ళ మనషులా, పిశాచాలా అన్న అనుమానం కలుగుతున్నది!" అన్నాడు.

అంతా జాగ్రత్తగా గమనిస్తున్న కనకయ్య, సోమన్న ఇచ్చిన మంచినీళ్ళు తాగి, అరుగు మీద కొంతసేపు కూర్చుని సేదతీరి, గవరయ్యతో, "గవరయ్యా! ఆ రాజన్నగారిది ఇల్లు కాదనీ, పెద్ద మేడ అనీ పట్నంలో చెప్పగా విన్నాను. నేనక్కడికి వెళ్ళదలుచుకోలేదు, వెంటనే పట్నం తీసుకుపో!" అంటూ దూరంగా వీధిలోకి నడిచాడు.

గవరయ్య పరుగు పరుగునా ఆయన్ని సమీపించి, "అదేంటి బాబూ అలా వెళుతున్నారు! పెళ్ళికొడుకును చూడరా?" అని అడిగాడు ఆశ్చర్యంగా.

"పెళ్ళికొడుకును చూడడం అయిపోయిందిలే!" అంటూ కనకయ్య బండి ఎక్కి పట్నం దారిలో గవరయ్యతో, "మనసులో దయా, జాలీ అనేది ఏమాత్రం లేని మనుషుల మధ్య, మా అమ్మాయి ఎలా బతగ్గలదు? ముసలితనం వచ్చాక, అది ఎద్దయినా, మనిషయినా కొందరి దృష్టిలో అదొక శాపం. ఆస్తిపాస్తుల్లో నాతో సరితూగలేకపోయినా, సోమన్న గారి కుటుంబం యావత్తూ దయా, జాలీ, కనికరం వున్నవాళ్ళు. మా అమ్మాయి అలాంటివాళ్ళ మధ్యే సుఖపడగలదు!" అన్నాడు.






తన తండ్రి అయిన పరీక్షిత్తు ఎలా మరణించిందీ జనమేజయుడు ఇప్పుడే తెలుసుకున్నాడు. పసితనంలోనే అతన్ని మంత్రులు రాజుగా అభిషేకించి, యుక్తవయసు వచ్చాక అతనికి కాశీరాజు కూతురైన వపుష్టను తెచ్చి పెళ్ళి చేశారు.

"మీ తండ్రి పరీక్షిత్తు మహారాజు పాము కరిచి మరణించాడు గనక, ఈ ఉదంక మహాముని హెచ్చరించినట్టుగా నువ్వు సర్పయాగంచెయ్యటం అన్ని విధాలా ఉచితం గానే ఉంటుంది," అని మంత్రులు జనమేజయుడితో అన్నారు.

జనమేజయుడు సర్పయాగం చెయ్యటానికీ, అందులో తక్షకుడు మొదలైన సర్పాలను యాగాగ్నికి ఆహుతి చేసి బూడిద చెయ్యటానికీ తీర్మానించుకుని, పండితులనూ, రాజపురోహితులనూ, ఋత్విక్కులనూ పిలిచి, సర్పయాగం చేసే విధాన మేమిటని అడిగాడు. సర్పయాగమన్నది జనమేజయుడొక్కడికోసమే ఏర్పడిందనీ, దాన్ని మరెవ్వరు చెయ్యరనీ ఋత్విక్కులు చెప్పారు.

యాగసంభారాలన్నీ సేకరించబడ్డాయి. యజ్ఞశాలలు నిర్మించారు. ఒక వంక యాగానికి ఏర్పాట్లు చకచకా జరుగుతూ ఉంటే, లోహితాక్షుడు అనే సూతుడు, భవిష్యత్తు తెలిసినవాడు కావటంచేత, "ఈ యాగం పూర్తికాకుండా ఒక బ్రాహ్మణుడు అడ్డుపడతాడు," అని చెప్పాడు.

జనమేజయుడు అతనిహెచ్చరికను పాటించకపోగా, యాగం జరిగేటంత కాలమూ లోహి

2. యయాతి కథ

సర్ప వినాశనం చూసి వాసుకి చాలా దిగులుపడ్డాడు. అతను తన చెల్లెలైన జరత్కారువు వద్దకు వెళ్ళి, "ఇలా జరగకుండా ఉండాలనే కదా నిన్ను జరత్కారుడనే మునికిచ్చి పెళ్ళి చేశాం! నీ కొడుకైన అస్తీకుణ్ణి పంపి వెంటనే ఈ యాగం ఆపు చేయించు," అన్నాడు.

తల్లి చెప్పిన మీదట అస్తీకుడు సర్పయాగం జరిగేచోటికి వెళ్ళి, స్వస్తివాచకం చెప్పి, రాజునూ, ఋత్విక్కులనూ, అగ్నినీ గొప్పగా స్తోత్రం చేశాడు. జనమేజయుడు అస్తీకుణ్ణి చూసి ఎంతో ముచ్చటపడి, "చూస్తే కుర్రవాడు, ఎంత జ్ఞానం కనబరిచాడు! ఇతను కోరిన వరం ఇవ్వదలిచాను," అని సదస్యులతో అన్నాడు.

వెంటనే అస్తీకుడు సర్పయాగం నిలపమని కోరాడు.

జనమేజయుడు సర్పయాగం ఆపటం తప్ప ఇంకేమి కోరినా ఇస్తానన్నాడు. కాని అస్తీకుడు అందుకు ఏమాత్రం ఒప్పలేదు. మిగిలిన వాళ్ళు కూడా జనమేజయుణ్ణి ఇచ్చిన మాట నిలబెట్టుకోమన్నారు. సర్పయాగం నిలిచిపోయింది.

అప్పుడు జనమేజయుడు అందరికీ దక్షిణ సత్కారాలు జరిపి, వేదవ్యాసుడు శిష్య సహితంగా అక్కడికి రాగా, తన పూర్వీకులైన పాండవుల వృత్తాంతాలన్నింటినీ వైశంపాయనుడి నోట విన్నాడు.



తాక్షుణ్ణి యజ్ఞశాలలోకి రానివ్వవద్దని ఉత్తరువు చేసి, వపుష్టమహాదేవితో సహా తాను యజ్ఞదీక్ష తీసుకుని, యజ్ఞశాలా ప్రవేశం చేశాడు. సర్పయాగానికి చండభార్గవుడనే వాడు హెూత, పింగళుడు అధ్వర్యుడు, కౌత్సుడు ఉద్గాత. యాగం ఆరంభమయింది. ఎక్కడెక్కడి సర్పాలూ అగ్నిగుండంలో పడిపోతున్నాయి. వాటి సంఖ్య వేలకూ, లక్షలకూ పాకింది.

తక్షకుడు బెదిరిపోయి ఇంద్రుణ్ణి శరణు జొచ్చాడు. "ఈ సర్పయాగంలో కొన్ని మేటి సర్పాలకు భయం ఉండదని బ్రహ్మ ముందే చెప్పాడు. భయపడకు. నావద్దనే ఉండు," అన్నాడు ఇంద్రుడు.



భారత వంశానికి మూలపురుషుడు వైవస్వతమనువు. ఆయన అదితికి మనమడు. వైవస్వతుడి కూతురైన ఇళకు పురూరవుడు పుట్టాడు. పురూరవుడికీ, ఊర్వశికీ కలిగిన ఆరుగురు కొడుకులలో ఆయువు అనేవాడికి నహుషుడు మొదలుగా నలుగురు కొడుకులు పుట్టారు. నూరు యజ్ఞాలు చేసి ఇంద్రత్వం కూడా కొంత కాలం అనుభవించిన నహుషుడు, ఆరుగురు కొడుకులను కన్నాడు. వారిలో యయాతి రెండవవాడు. పెద్దవాడైన యతి తపస్సుకు పోగా, యయాతి రాజ్యపాలన చేశాడు.

యయాతి రాజ్యపాలన చేసే కాలంలో శుక్రుడు దానవులకు పురోహితుడుగా ఉండేవాడు. దేవదానవ యుద్ధాలలో చనిపోయిన దానవులను ఆయన మృతసంజీవని అనే మంత్రంతో బతికించేవాడు. దేవతల గురువైన బృహస్పతికి ఆ విద్య రాదు. అందుచేత దేవతలు బృహస్పతి కొడుకైన కచుడనేవాణ్ణి, మృతసంజీవనీ మంత్రం నేర్చుకు రమ్మని శుక్రుడి వద్దకు పంపారు.

కచుడు వచ్చి శుక్రుడికి శుశ్రూష చేస్తూ, శుక్రుడి కుమార్తె అయిన దేవయానికి సంతోషం కలిగిస్తూ గడిపాడు. కచుడు బృహస్పతి కొడుకని దానవులకు తెలియవచ్చింది. అతను అరణ్యంలో గురువుగారి గోవులను కాసేటప్పుడు దానవులు అతన్ని చంపి ముక్కలు చేసి, తోడేళ్ళకు వేశారు. ఈ సంగతి తెలియగానే శుక్రుడు తన మృతసంజీవనితో కచుణ్ణి మళ్ళీ బతికించాడు. ఇంకోసారి కచుడు దేవయాని కోసం పూలు తేవటానికి పోతే, దానవులు అతన్ని మళ్ళీ చంపి, సముద్రంలో కలిపేశారు. కచుడి కోసం దేవయాని దీనంగా ఏడవసాగింది. శుక్రుడు అతన్ని మళ్ళీ బతికించాడు.

దానవులు మూడోసారి కచుణ్ణి చంపినప్పుడతన్ని బూడిద చేసి, ఆ బూడిదను కల్లులో కలిపి, శుక్రుడికి తాగటానికి ఇచ్చారు. ఈసారి శుక్రుడు బతికించినప్పుడు, కచుడు శుక్రుడి పొట్టలో ఉన్నాడు. శుక్రుడు విధిలేక అతనికి మృతసంజీవనీ మంత్రం చెప్పి, తన పొట్ట చీల్చుకుని బయటికి రమ్మనీ, ఆ

తరవాత ఆ మంత్రంతో తనను తిరిగి బతికించమనీ అన్నాడు. కచుడు వెలుపలికి వచ్చి అలాగే చేశాడు.

కచుడు వచ్చిన పని అయిపోయింది. అతను సమయం చూసుకుని, వెళ్ళి వస్తానన్నాడు గురువుతో.

అప్పుడుదేవయాని, "నీమీదఅభిమానంతో నిన్ను ఎన్నోసార్లు బతికించుకున్నాను. నన్ను పెళ్ళాడు," అన్నది.

"అమ్మమ్మా, నువ్వు గురుపుత్రివి. నా చెల్లెలులాటి దానివి," అన్నాడు కచుడు.

"అలా అయితే, నీకు మృత సంజీవని ఫలించకుండుగాక!" అని దేవయాని కచుడికి శాపం పెట్టింది.

"నిన్ను బ్రాహ్మణుడెవరూ పెళ్ళాడకుండుగాక," అని ఎదురు శాపం పెట్టి కచుడు తిరిగి వెళ్ళిపోయాడు.

దానవులకు రాజైన వృషపర్వుడికి శర్మిష్ఠ అని కూతురున్నది. ఒకనాడామె దేవయానినీ, అనేకమంది చెలికత్తెలనూ వెంటబెట్టుకుని వనవిహారానికి బయలుదేరింది. ఒకచోట వాళ్ళకొక సరస్సు కనబడింది. యువతులందరూ తమ బట్టలు విప్పి, ఒడ్డున పెట్టి, సరస్సునకొంతసేపుజలకాలాడారు.ఆసమయంలో గాలికొట్టి వాళ్ళ చీరలు లుంగ చుట్టుకుపోయాయి. జలక్రీడలు ముగించి యువతులు గబగబా ఒడ్డుకు వచ్చి చీరలుకట్టుకోవటంతో, తొందరలో శర్మిష్ఠ చీర మిగిలింది.



దేవయాని పట్టరాని అహంకారంతో, "ఓసి రాకాసీ, నేను బ్రాహ్మణ స్త్రీని. నీ చీర నేను కట్టను. నాకు ఆచారం వుంది. నా చీర నువ్వెందుకు కట్టుకున్నావు?" అని నిలదీసి అడిగింది.

"పోవే, బిచ్చగత్తే! నీ తండ్రి, నా తండ్రి ఇచ్చినది స్వీకరించి, మమ్మల్ని ఆశ్రయించి బతుకుతున్నాడు. నా చీర కట్టడానికి నీకు ఆక్షేపణ వచ్చిందా?" అని శర్మిష్ఠ అన్నది. అంతటితో ఊరుకోక శర్మిష్ఠ పట్టరాని కోపావేశంలో దేవయానిని ఆపక్కనే వున్న పాడుపడిన బావిలోకి తోసి, తన చెలికత్తెలతో కలిసి వెళ్ళిపోయింది.

కొంచెం సేపటికి యయాతి అటుగా వచ్చాడు. ఆయన వేటాడుతూ, అలిసిపోయి,



దప్పికతో బావి సమీపించి లోపలికి తొంగి చూశాడు. దేవయాని కనిపించింది. "ఎవరు నువ్వు?బావిలో కెలావచ్చావు?" అని యయాతి అడిగాడు.

"నేను దానవగురువైన శుక్రాచార్యుల కుమార్తెను. నా పేరు దేవయాని. కారణాంతరంచేత నేను బావిలో పడ్డాను. నన్ను బయటికి తియ్యి," అంటూ దేవయాని తన చేతిని పైకి చాచింది.

యయాతి తన కుడి చేత్తో ఆమె కుడి చెయ్యి అందుకుని, ఆమెను పైకి లాగి, తన దారిన తాను వెళ్ళాడు.

ఈలోపల ఘూర్ణిక అనే దాసీది దేవయానిని వెతుక్కుంటూ అటు వచ్చింది. దేవయాని దానితో, "ఒసే, నేనిక వృషపర్వుడి నగరులో అడుగుపెట్టను. శర్మిష్ఠ నాకు చేసిన ఘోర అపచారం గురించి నా తండ్రికి చెప్పు, పో," అన్నది.

కబురందగానే శుక్రుడు దేవయాని వద్దకు పరిగెత్తుకుంటూ వచ్చి, "శర్మిష్ఠకు నువ్వేం అపకారం చేశావు, తల్లీ?" అని అడిగాడు ఆత్రంగా.

దేవయాని తండ్రితో జరిగినదంతా చెప్పి, శర్మిష్ఠ ఆయనను అన్న మాటలు కూడా చెప్పింది. అంతా విని శుక్రుడు, "అమ్మా, నువ్వు తప్ప నాకెవరున్నారు? నువ్వు రాకపోతే వృషపర్వుడి నగరానికి నేనూ వెళ్ళను," అన్నాడు.

ఇంతలో సంగతంతా తెలుసుకుని వృషపర్వుడు స్వయంగా బయలుదేరి వచ్చి, "మీరిద్దరూ ఈ వనంలో ఉన్నారేమిటి? నగరానికి పోదాం పదండి," అన్నాడు.

"మీ వరస నాకేమీ బాగాలేదు. మీవాళ్ళు నా శిష్యుడైన కచుణ్ణి మాటిమాటికీ చంపారు. ఇప్పుడేమో నీ కూతురు నా కూతుర్ని నూతిలోకి తోసి, చంపాలని చూసింది. నాకు మీ సేవ వద్దు," అన్నాడు శుక్రుడు కోపంగా.

వృషపర్వుడు కాళ్ళావేళ్ళా పడ్డాడు. దేవయానిని ఒప్పించమనీ, ఆమె ఇష్టమే తన ఇష్టమనీ శుక్రుడు చెప్పాడు. శర్మిష్ఠా, ఆమె దాసీజనమూ తనకు దాసీలుగా ఉండేటట్టయితే తాను నగరుకు వస్తానన్నది దేవయాని.

వృషపర్వుడు సరేనన్నాడు. శర్మిష్ఠ దేవయానికి దాసిగా వచ్చింది; దేవయాని సూటిపోటి మాటలన్నీ సహించింది. ఎందుకంటే శుక్రాచార్యులు మూలంగా దానవలోకం ఎంతో మేలు పొందింది.

ఒకనాడు దేవయాని శర్మిష్ఠనూ, మిగిలిన దాసీలనూ వెంటబెట్టుకుని, పూర్వం వెళ్ళిన చోటికే వెళ్ళింది. మళ్ళీ యయాతి వేటాడుతూ అటుగా వచ్చాడు; శర్మిష్ఠనూ, దేవయానినీ చూసి, "మీరెవరు?" అని అడిగాడు.

దేవయాని అతని పేరూ, కులమూ తెలుసుకుని, "ఇంతకు పూర్వం నాకు చెయ్యి ఇచ్చి నూతిలో నుంచి నువ్వే కదా పైకి లాగావు. ఆ రోజు మనకు పాణిగ్రహణం జరిగింది. అది మొదలు నిన్నే నా భర్తగా భావిస్తున్నాను," అన్నది.

బ్రాహ్మణుడి కూతుర్ని ఎలా పెళ్ళాడటమా అని యయాతి జంకాడు. కాని శుక్రుడు వారిద్దరి పెళ్ళినీ ఆమోదించాడు. ఇద్దరికీ వైభవంగా పెళ్ళి అయింది. శుక్రుడూ, దానవ ప్రముఖులూ యయాతికి ఘనంగా కట్నాలు ఇచ్చారు. దేవయాని శర్మిష్ఠనూ, మరి రెండు వేలమంది దాసీలనూ వెంటబెట్టుకుని కాపురానికి వచ్చింది. శర్మిష్ఠా, దాసీలూ ఉండటానికి అశోకవనానికి సమీపంగా ఒక పెద్ద భవనాన్ని యయాతి ఏర్పాటుచేశాడు.

దేవయాని యయాతికి యదుడూ, తుర్వసుడూ అనే కొడుకులను కన్నది.



కొంతకాలం గడిచాక శర్మిష్ఠ తన స్థితి తలుచుకుని విచారించింది. ఇంత కాలమైనా తనకు పెళ్ళి కాలేదు. దేవయాని అప్పుడే పిల్లల తల్లి కూడా అయింది. "దేవయాని వరించినట్టుగానే నేను కూడా యయాతిని ఎందుకు వరించ రాదు?" అని శర్మిష్ఠ అనుకున్నది.

ఒకనాడు యయాతి అశోకవనంకేసి రాగా, శర్మిష్ఠ ఆయనను కలుసుకుని, "రాజా, నా యజమానురాలికి భర్త వైన నువ్వు నాకూ భర్తవే. నన్ను భార్యగా పరిగ్రహించు. ఇందులో అధర్మం లేదు," అన్నది.

శుక్రుడేమంటాడోనని యయాతి భయపడ్డాడు. అయినా ఆమె కోరికను నిరాకరించ

లేక, ఆమెతో రహస్యంగా కాపురం చేస్తూ, ఆమె ద్వారా ద్రుహ్యుడు, అనుడు, పూరుడు అనే కొడుకులను కన్నాడు.

శర్మిష్ఠ పిల్లల తల్లిఅయిన మాట దేవ యానికి తెలియవచ్చింది. ఆమె శర్మిష్ఠను చూడబోయి, "నీవు ఉత్తమశీలవనీ, నీతిపరు రాలివనీ, గొప్ప వంశంలో పుట్టినదానవనీ అంటున్నారే, పెళ్ళి కాకుండానే నీకే పిల్లలు ఎలా కలిగారు?" అని అడిగింది.

శర్మిష్ఠ సిగ్గుతో తల వంచుకుని, "నేను ఋతుస్నానం చేసిన తరుణంలో ఒక మహా ముని వచ్చి నాకు పుత్రదానం చేశాడు," అన్నది.

"ఎవరా ముని? ఏం పేరు? ఏం కులం?" అని దేవయాని మళ్ళీ అడిగింది.

"ఆ మహానుభావుడి దివ్యతేజస్సు చూస్తూ నాకు ఆ వివరాలు అడగ బుద్ధి కాలేదు," అన్నది శర్మిష్ఠ.

దేవయాని తృప్తిపడింది.

మరొకసారి యయాతీ, దేవయానీ కలిసి శర్మిష్ఠ ఉండేచోటికి విహారంగా వచ్చారు. అప్పుడు దేవయాని నిజం తెలుసుకున్నది. శర్మిష్ఠ బిడ్డలలో యయాతి పోలికలున్నాయి. "మీ తండ్రి ఎవరు? నిజం చెప్పండి," అని ఆమె ఆ పిల్లల నడిగితే వాళ్ళు యయాతిని చూపారు.

వెంటనే దేవయాని శర్మిష్ఠ పైన విరు చుకుపడుతూ, "ఓసి రాకాసీ, నాకే ద్రోహం తలపెట్టావా?" అన్నది.

శర్మిష్ఠ ఏమాత్రం తొణకకుండా, "నేను అధర్మం చెయ్యలేదు. ఈ రాజును నువ్వు వరించినట్టే నేను వరించాను. నువ్వు నాకన్నా పెద్దదానవు, బ్రాహ్మణ స్త్రీవి. అందుకని నిన్ను గౌరవిస్తాను. కాని ఈయన రాజర్షి. అందుకే, ఒక ఋషికి పిల్లలను కన్నానని నీతో చెప్పాను," అన్నది.

దేవయాని యయాతితో, "నాకు ద్రోహం చేశావు. నేను నీవద్ద ఉండను," అని, తిన్నగా తన తండ్రి వద్దకు వెళ్ళి, జరిగినదంతా చెప్పింది.

శుక్రుడు ఆగ్రహం చెంది యయాతిని, ముసలివాడవు కమ్మని శపించాడు.



## చందమామ కబుర్లు



### అదృష్టదేవత

పేదలైన అరబ్ దంపతులకు పుట్టిన పాపాయి ఒక్క పూటలో కోటీశ్వరురాలై కూర్చుంది! ఇదెలా సాధ్యమయింది? ఇజ్రాయెల్, టెల్అవివ్ పట్టణంలోని ఒక ఆస్పత్రిలో బలీల్ అనే ఆడశిశువును ప్రసవించింది మరియం అలామోర్. ఆ సమయంలోనే ఇజ్రాయెల్‌లో 'అదృష్ట నక్షత్రం' అనే లాటరీని ప్రారంభించడం జరిగింది. మరియం అలామోర్ తన పాప పేరుకు ఒక టిక్కెట్టు కొన్నది. అది 1,000,000 షెకెల్ అంటే దాదాపు 3,30,000 అమెరికన్ డాలర్లకు సమానమైన మొత్తాన్ని తెచ్చి పెట్టింది! అంతవరకు నిరుద్యోగంతో ప్రభుత్వంనుంచి భత్యం పుచ్చుకుంటూన్న ఆమె తల్లి తండ్రులు తమ 'అదృష్టదేవత' తెచ్చిన మొత్తంతో మొదట మెక్కా వెళ్ళాలనీ, ఆ తరవాత పాప కోసం మంచి ఇల్లు కొనాలనీ నిర్ణయించారు.

### మొట్టమొదటిది!

చారిత్రక పూర్వయుగం నాటి డినోజార్స్ అనే రాక్షసబల్లుల గుడ్లు శిలాజాలుగా మారి అక్కడక్కడ బయల్పడినట్టు చదువుకున్నాం! గత ఏప్రిల్ నెలలో దక్షిణ అమెరికాలోని పెరూలో 3,00,000 సంవత్సరాల నాటి గుర్రం అస్థిపంజరం ఒకటి బయటపడింది. విజ్ఞానవేత్తలు వెలిబుచ్చిన ఆ గుర్రం కాలం వాస్తవంఅయినట్టయితే, అదే ప్రపంచంలోకెల్లా అతి ప్రాచీనమైన గుర్రం అస్థిపంజరమవుతుంది!



### పది లక్షల చిత్రాలు!

న్యూయార్క్‌లో స్థిరపడిన భారతీయ ఆధ్యాత్మిక గురువు చిన్మయ్ శాంతికి సంకేతాలయిన పావురాల చిత్రాలను పది లక్షలు చిత్రించాడు. ఆయన ఫిజీ దీవుల్లో ఉన్నప్పుడు చిత్రించిన పావురం చిత్రాన్ని మాజీ రష్యా అధ్యక్షుడు గోర్బచేవ్ సతీమణి రైజా గోర్బచేవ్‌కు అంకితమిచ్చాడు. 'ప్రతి చిత్రం నా హృదయ ప్రార్థన' అంటాడు చిన్మయ్.




ఒక గ్రామంలో ఒక రైతుండేవాడు. ఆయనకు రాఘవులు అని ఒక కొడుకుండేవాడు. రైతుకు కొడుకు మీద కొంచెం కూడా ప్రేమ లేదు. ఆయన వాణ్ణి కర్కోటకుడల్లే చూసేవాడు. వాడిచేత చచ్చేటట్టు పొలం పనీ, దొడ్డి పనీ చేయించేవాడు. రాఘవులు మంచి పనిమంతుడు. అయితే ఏం లాభం? వాడు ఎంత పని చేసినా, చేసిన పని ఎంత బాగా చేసినా మెప్పు ఉండేది కాదు. వాడు పని జాస్తిగా చేసినకొద్దీ తండ్రి వాడికి మరింత పని కల్పించేవాడు.

రాఘవులుండే ఊళ్ళోనే రామి అనే ఒక పేదవాళ్ళ పిల్ల ఉండేది. రామి కూడా రాఘవులులాగానే బుద్ధిమంతురాలూ, పనిమంతురాలూనూ. వాళ్ళిద్దరికీ మనసులు కలిశాయి. పెళ్ళి చేసుకుందామనుకున్నారు. పెళ్ళికి రామి తండ్రి ఒప్పుకున్నాడు. రాఘవులు తన తండ్రికి తన ఉద్దేశం తెలిపాడు.

"నిన్నే పోషించలేక చస్తుంటే నీ బతుక్కు తోడు ఒక పెళ్ళాన్ని కూడా తెస్తావా? అదేమీ కుదరదు. నన్ను చిల్లిగవ్వ అడగకుండా పెళ్ళాన్ని పోషించుకోగలిగిననాడు పెళ్ళి చేసుకుందువుగానిలే!" అన్నాడు రాఘవులు తండ్రి.

తన తండ్రి కింద చేసే వెట్టిచాకిరి ఇంకెక్కడన్నా చేసుకుంటే తాను పెళ్ళాన్ని పోషించుకోవచ్చునని రాఘవులుకు తోచింది. వాడు ఒకనాడు తండ్రితో చెప్పకుండా ఇల్లు విడిచి దేశాల మీద బయలుదేరాడు. తను ఇలా పోతున్నట్టు ఒక్క రామికి మాత్రమే చెప్పాడు.

పోగా పోగా ఒక అడవి వచ్చింది. ఆ అడవిలో ఒక అవ్వ కనిపించింది. ఆ అవ్వ నెత్తిన కట్టెల మోపు ఉన్నది.

"అవ్వా, అవ్వా! పెద్దదానివి, నువ్వు మొయ్యలేవు. ఆ మోపు ఇటియ్యి, మీ ఇంటిదాకా దాన్ని మోసుకువచ్చి పడేస్తాను," అన్నాడు రాఘవులు.

"ఏవూరు, నాయనా? నీ పేరేమిటి? ఎక్క డికి ప్రయాణమై పోతున్నావు?" అని అడిగింది అవ్వ, తన నెత్తిమీది మోపు రాఘవులుకిచ్చి.

రాఘవులు అవ్వకు తన కథ అంతా చెప్పి, "ఎక్కడన్నా పని చూసుకుందామని వెళుతున్నాను, అవ్వా. నాలుగు డబ్బులు చేర్చినాక, మా వూరు పోయి రామిని పెళ్లి చేసుకుంటాను," అన్నాడు.

"అయితే ఎక్కడికో పోవటం దేనికి, రాఘ వులూ? మా ఇంట్లో పనిచెయ్యి. పని చేసిన న్నాళ్ళూ తిండి పెట్టి, ఏడాది అయినాక నాకు తోచినది ముట్టజెప్పుతాను," అన్నది అవ్వ.

"అట్లాగే కానీ, అవ్వా! పెద్దదానివి నీకు సేవ చేస్తే ఇంత పుణ్యం కూడా ఉంటుంది," అన్నాడు రాఘవులు.

రాఘవులు ఏడాదిపాటు అవ్వ దగ్గిర పనిచేశాడు. పశువులకు మేతా, నీరూ పెట్ట డమూ, పాలు పితకటమూ, దొడ్లో కూరగా యలు పెంచటమూ, అడవిలో కట్టెలు కొట్టి తేవడమూ మొదలైన పనులన్నీ వాడు ఎంతో శ్రద్ధగా, ఒళ్లు దాచుకోకుండా చేశాడు. అవ్వ వాడికి మూడు పూటలా సుష్టుగా భోజనం పెట్టింది. ఏడాది పూర్తికాగానే ఆమె వాడితో, "రాఘవులూ, ఏడాదిపాటు చెప్పిన పని చక్కగా చేశావు. నీకు ఏదైనా ఇచ్చి మరీ పంపుతాను అన్నాను గదా! నా దగ్గిర ఉన్న గాడిదను తీసుకుపోయి సుఖంగా జీవించు," అన్నది.



రాఘవులు తెల్లమొహం వేశాడు. గాడిద తనకు ఎందుకు ఉపయోగిస్తుంది? దాన్ని మేపటం ఎలాగూ? ఏ చాకలికైనా అమ్మితే రెండు రూపాయలు రావచ్చు. కాని దానితో తను భార్యను ఎలా పోషిస్తాడు? అవ్వ తనను మోసం చేసింది!

వాడి మొహంలో నిరాశ చూసి అవ్వ నవ్వి, "పిచ్చివాడా, నీచేత ఇంతకాలం పని చేయించుకుని మామూలు గాడిదను ఇచ్చి పంపుతానా? దాని రెండుచెవులూ పట్టి గట్టిగా లాగి చూడు ఏం జరుగుతుందో, నీకే తెలు స్తుంది!" అన్నది.

చెవులు పట్టి లాగగానే గాడిద, "హా-హీ! హా-హీ!" అని ఓండ్రపెట్టసాగింది. అది అలా




ఓండ్ర పెట్టినప్పుడల్లా ముత్యాలూ, రత్నాలూ రాలాయి. వాటిని చూసి రాఘవులు పరమానందభరితుడై, అవ్వకు నమస్కారం చేసి, ఆ గాడిదనే ఎక్కి తన స్వగ్రామానికి బయలుదేరాడు.

వాడు ఒక ఊరు చేరేసరికి పొద్దుగూకింది. వాడు తిన్నగా పేదరాసి పెద్దమ్మ ఇంటికి వెళ్ళి, "పెద్దమ్మా, పెద్దమ్మా, ఈ నాకు రాత్రికి భోజనం పెట్టు, ఇక్కడే పడుకుని రేపు తెల్లవారగానే లేచి నా దారిన నేను పోతాను," అన్నాడు.

పెద్దమ్మ కొడుకు, రాఘవులు గాడిదను తీసుకుపోయి, ఇంటి బయట కొబ్బరిచెట్టుకు కట్టేశాడు.

రాఘవులు భోజనం చేసి పడుకోబోతుండగా పేదరాసి పెద్దమ్మ, "నాయనా, నువ్వు మళ్ళీ చీకటితోనే బయలుదేరతావో ఏమో, నాకివ్వవలసిన వరహా ఇప్పుడే ఇచ్చేస్తావేమిటి?" అన్నది.

"కొంచెం ఉండు, పెద్దమ్మా. ఇప్పుడే డబ్బు తెస్తాను," అంటూ రాఘవులు బయటికి వెళ్ళి, తన గాడిద చెవులు పట్టి గట్టిగా లాగాడు. గాడిద "హా-హీ, హా-హీ!" అని ముత్యాలూ, రత్నాలూ రాల్చింది.

రాఘవులు ఇంటి లోపలికి వచ్చి పేదరాసి పెద్దమ్మకొక ముత్యం ఇచ్చి, "బీదదానివి ఉంచుకో!" అన్నాడు.

జరిగినదంతా పెద్దమ్మ కొడుకు చూశాడు. రాఘవులు నిద్రపోయినాక వాడు లేచి వెళ్ళి కొబ్బరిచెట్టుకు కట్టిన గాడిదను విప్పి దూరాన కనపడకుండా కట్టేసి మరొక గాడిదను తెచ్చి, కొబ్బరి చెట్టుకు కట్టేశాడు. తరవాత వాడు రాఘవులు బట్టలు తడివి, వాడు మూటగట్టుకున్న ముత్యాలనూ, రత్నాలనూ కూడా లాగేశాడు.

రాఘవులు తెల్లవారుజామునే లేచి కొబ్బరి చెట్టుకు కట్టి ఉన్న గాడిదను ఎక్కి ఇంటికి వెళ్ళిపోయాడు. వాడు తండ్రితో తాను సంపాదించిన గాడిద సంగతి చెప్పి, "దాని చెవులు గట్టిగా లాగిచూడు, నీకే తెలుస్తుంది!" అన్నాడు.

రైతు తన కొడుకు చెప్పినట్టే చేశాడు. గాడిద "హా-హీ!" అన్నది, కాని ముత్యాలు

రాల్చటానికి బదులు రైతును వెనక కాళ్ళతో మొహం పగిలేటట్టు తన్నింది.

"ఛీ, బుద్ధిలేని గాడిదా! నిన్ను ఎవరో బాగా టోపీ వేశారు! నా కళ్ళ ఎదట కనిపించకు!" అని రాఘవులును తండ్రి గట్టిగా తిట్టాడు.

ఇంత మోసం ఎలా జరిగిపోయినదీ రాఘవులుకు అంతు చిక్కలేదు. వాడు మళ్ళీ ఎక్కడైనా పని చేసుకోవటానికి బయలుదేరాడు. పోగాపోగా ఒక అడవి వచ్చింది. ఆ అడవిలో ఒక వడ్రంగి కొయ్య పలకలు చెక్కి వాటిని ఒక కట్టకట్టి తీసుకుపోతూ కనిపించాడు.

"తాతా, తాతా! పెద్దవాడివి, వాటిని నువ్వెక్కడ మోస్తావు? నాకియ్యి, మీ ఇంటి దాకా తెచ్చి నాదారిన నేను పోతా!" అన్నాడు రాఘవులు. వడ్రంగి రాఘవులు సమాచారమంతా విని తనకింద సంవత్సరం పాటు పనిచేస్తే తనకు తోచినది ఇస్తానన్నాడు. రాఘవులు సరేనని ఏడాదిపాటు వడ్రంగికి అన్నివిధాలా తోడ్పడ్డాడు. వాడువెళ్ళిపొయ్యేటప్పుడు వడ్రంగి ఒక కంచు పళ్లెం ఇస్తూ, "ఇది మామూలు కంచంకాదు. 'అన్నం పెట్టవే, కంచమా!' అని ఎవరన్నా అంటే చాలు పంచభక్ష్య పరమాన్నాలిస్తుంది," అన్నాడు.

రాఘవులు ఆ కంచాన్ని తన ముందు పెట్టుకు కూచుని, "అన్నం పెట్టవే కంచమా!" అన్నాడు. వెంటనే కంచం నిండా అన్నమూ, కూరలూ సిద్ధమయాయి. వాడు వాటినన్నిటినీ ఆరగించి, వడ్రంగికి నమస్కారంచేసి కంచం చంకపెట్టుకుని బయలుదేరాడు.





వాడు వెనుకటిలాగే పేదరాసి పెద్దమ్మ ఉండే ఊరికి వచ్చేసరికి పొద్దు వాలింది. వాడు పేదరాసి పెద్దమ్మ ఇంటికి వెళ్ళి పెద్ద మ్మతో, "ఈ రాత్రికి ఇక్కడ పడుకుని రేపు తెల్లవారగానే నా దారిన పోతాను, పెద్దమ్మా!" అన్నాడు.

"భోజనమో, నాయనా?" అన్నది పేదరాసి పెద్దమ్మ.

"నాదగ్గిర భోజనం పెట్టే కంచం ఉందిలే, పెద్దమ్మా," అంటూ రాఘవులు తన కంచం తీసి, "అన్నం పెట్టవే కంచమా!" అన్నాడు. దానిలోకి వచ్చిన భోజనం రాఘవులూ, పెద్దమ్మా, పెద్దమ్మ కొడుకూ తిన్న తరవాత కూడా ఇంకా చాలా మిగిలిపోయింది.

పెద్దమ్మ కొడుకు ఒక రాత్రివేళ లేచి, రాఘవులు నిద్రపోతూండగా, అతని కంచం కాజేసి, దాని స్థానంలో అటువంటిదే మరొక కంచం పెట్టాడు. రాఘవులు దాన్ని తీసుకు పోయి తండ్రికి చూపి, "ఈసారి నేనేం తెచ్చానో చూడు!" అంటూ కంచం బయటికి తీసి, "అన్నం పెట్టవే, కంచమా!" అన్నాడు. కాని, కంచం ఖాళీగానే ఉండిపోయింది. వాడు అన్నం పెట్టమని ఎన్నిసార్లు కేకలు పెట్టినా అది వినిపించుకోలేదు.

మళ్ళీ రాఘవులు పని చూసుకోవటానికి బయలుదేరి వెళ్ళాడు. పోగా పోగా ఒక వాగు వచ్చింది. ఆ వాగు ఒడ్డున ఒక పెద్ద చెట్టు న్నది. ఒక వయసుమళ్లిన వాడొకడు దానిని గొడ్డలితో కొట్టుతున్నాడు.

"ఎందుకా చెట్టును పడగొట్టుతున్నావు, పెద్దయ్యా?" అన్నాడు రాఘవులు.

"వాగుకు వంతెన కోసం రా, బాబూ!" అన్నాడు వయసుమళ్ళిన వాడు.

"ఆ గొడ్డలి ఇట్లా ఇయ్యి," అని రాఘవులు బలంగా పది దెబ్బలు వేసి, చెట్టు వాగుకు అడ్డంగా పడేటట్టు కొట్టాడు.

ఆ మనిషి రాఘవులు చేతి నుంచి గొడ్డలి తీసుకుని, "మంచి సహాయం చేశావురా, బాబూ. నీకష్టానికి ప్రతిఫలం ఇదం!" అంటూ చెట్టుకొమ్మ ఒకటి రెండు నరుకులు నరికి చేతికర్ర లాగా తయారుచేసి ఇచ్చాడు చిన్నగా నవ్వుతూ.

రాఘవులు మర్యాదకోసం ఆ కర్ర తీసుకుని ముందుకు సాగబోతుండగా ఆ వయసు మళ్ళినవాడు, "చూడరా, బాబూ, అది మామూలు కర్ర అనుకునేవ్. నువ్వు దానితో ఎవరిని కొట్టమంటే వాళ్ళను కొడుతుంది. అందుచేత అది నీకు అన్ని విధాలా ఉపయోగం!" అన్నాడు.

రాఘవులు ఈ మాటలకు ఆశ్చర్యపడి, "గాలిని కొట్టవే, కర్రా!" అన్నాడు. వెంటనే ఆ కర్ర వాడి చేతినుంచి దూసుకుపోయి గాలిని బాదసాగింది. రాఘవులు ఆ కర్రను మళ్ళీ చేతికి తీసుకున్నాడు. వాడు తాపీగా ఆలోచించేసరికి పేదరాసి పెద్దమ్మ ఇంట్లోనే తన గాడిదా, కంచమూ మార్పిడి జరిగి వుండాలని తట్టింది.

వెంటనే వాడు కర్రను వెంట తీసుకుని పేదరాసి పెద్దమ్మ గ్రామం వెళ్ళాడు.

"ఏం పెద్దమ్మా! బాగున్నావా?" అని అడిగాడు రాఘవులు.

"నిన్నెప్పుడూ చూసినట్టు లేదే, నాయనా!" అన్నది పేదరాసి పెద్దమ్మ.

"అవును, మనం ఈ అబ్బాయినెప్పుడూ చూడలేదు," అన్నాడు పెద్దమ్మ కొడుకు అమాయకంగా.

"నా గాడిదనూ, కంచాన్నీ మీరు దొంగిలించారు. ఇప్పుడైనా జ్ఞాపకం వచ్చానా?" అన్నాడు రాఘవులు.

"మేము నీ సొత్తేమీ కాజెయ్య లేదు," అన్నాడు పెద్దమ్మకొడుకు.

"వాణ్ణి తన్నవే, కర్రా!" అన్నాడు రాఘవులు. వెంటనే వాడి చేతి కర్ర గాలిలో ఎగురుతూ వచ్చి పెద్దమ్మకొడుకును గట్టిగా దేహశుద్ధి చేసింది.

"క్షమించు, నాయనా! నేరక, బుద్ధి గడ్డి తిని నీ సొత్తు కాజేశాం! నీ వస్తువులు నువ్వు పట్టుకుపో! నా కొడుకును కాపాడు!" అని పేదరాసి పెద్దమ్మ మొరపెట్టిన మీదట రాఘవులు, "రావే, కర్రా!" అన్నాడు.

తరవాత రాఘవులు తన గాడిద మీద ఎక్కి, తన కంచాన్నీ, కర్రనూ వెంటబెట్టుకుని స్వగ్రామం చేరి రామిని పెళ్ళాడి ఏ లోటూ లేకుండా చాలాకాలం సుఖంగా జీవించాడు.





# మతిమరుపు

రంగాపురంలో వుండే వెంకటయ్యకు కోపమెక్కువ. అయినదానికీ కానిదానికీ భార్య మీద పెద్దగా కేకలేస్తూండేవాడు. దీనికి తోడు ఆయన భార్య సీతమ్మ పెద్ద మతిమరుపు మనిషి. అందువల్ల, ఆయన కోపాన్ని అదుపు చేయడం ఎవరి వల్లా కానిపనిగా వుండేది.

వెంకటయ్య, భార్యను గట్టిగా కోప్పడుతున్నప్పుడు, ఇరుగుపొరుగులు చూసీ చూడనట్టు చూసి ముసిముసి నవ్వులు నవ్వుకునే వాళ్ళు. ఇది సీతమ్మకు భర్త కోప్పడి, తనను నానా తిట్లూ తిట్టేదానికంటే అవమానంగా వుండేది. అయితే, ఆమెకు భర్తకోపాన్ని తగ్గించే ఉపాయమేదీ తోచలేదు.

ఇలా వుండగా — ఒకసాయంత్రం వెంకటయ్య పొలం నుంచి తిరిగొస్తూనే సీతమ్మను, "పొద్దున పొలం వెళుతూ నీకు ఒకటికి రెండుసార్లు చెప్పెళ్ళాను, బట్టలుతికావా?" అని అడిగాడు.

"అయ్యో! నా మతిమరుపు మండా, మరిచేపోయాను," అన్నది సీతమ్మ.

ఆ జవాబుతో వెంకటయ్య ఉగ్రుడైపోయి, "నీ కసలు మతే లేదు మండిపోవడానికి! నేను పెళ్ళికి బయలుదేరి వెళ్ళాలని చెప్పాగదా? పొద్దుననగా బట్టలు ఉతకమని చెప్పిపోతే, ఇదా నువ్వు చేసిన నిర్వాకం. ఈ మాసిన బట్టలతో వెళితే ఎవరైనా నా ముఖంకేసి చూస్తారా? అయినా, నిన్ను కట్టుకున్నందుకు అవమానాలు భరించాల్సిందే. అంతా నా కర్మ. నాపాలిటశనిలా దాపురించావు!" అంటూ పెద్దగా అరవసాగాడు.

ఈ అరుపులు ఇరుగుపొరుగులు విని, వీధి గుమ్మంలోకి వచ్చి చిరునవ్వులు నవ్వుకుంటూ వెళ్ళిపోయారు. ఇదంతా సీతమ్మకు విపరీతమైన అవమానంగా తోచింది. ఆ అవమాన భారంతో ఆమెకు తెలియకుండానే కళ్ళ వెంట జలజలా నీళ్ళుకారాయి.

చిలకలూరి విజయలక్ష్మి

అంత దుఃఖంలోనూ ఆమె, భర్తను శాంత పరచడానికి చాలా ప్రయత్నించింది. "ఏమండీ, పెళ్ళి రేపుగదా? ఇప్పుడు ఉతికి ఆరేస్తాను. రాత్రికి బాగా ఆరిపోతాయి. ఉదయానే కాస్త ముందుగా పెళ్ళికి బయలుదేరి వెళుదురు గాని," అని చెప్పింది.

అయినా వెంకటయ్య శాంతించక, "ఇక నువ్వు నాకేం చెప్పక్కర్లేదు. బట్టలు ఉతకక్క ర్లేదు. ఈ మాసిన బట్టలతోనే పెళ్ళికి వెళ్ళి అవమానపడివస్తాను. అప్పుడు నువ్వు సంతో షిద్దువుగాని," అంటూ అప్పుడే విసురుగా బయలుదేరి వెళ్ళాడు.



వెంకటయ్య వెళ్ళిపోగానే, పొరుగింటి అమ్మలక్క లిద్దరు సీతమ్మ దగ్గరకు వచ్చి, "అయ్యో, సీతమ్మా! నీకెన్నెన్ని కష్టాలు. లోకం లోమరే ఆడమనిషయినా ఇన్నికష్టాలుపడుతూ బతికుండగలదా! నీ మొగుణ్ణి చూస్తూంటే దుర్వాసమునిలా వున్నాడు. ఇలాంటి కోపిష్ఠి మొగుడితో నువ్వెలా కాపరం చేయగలుగుతు న్నావు? మేమయితే ఈ పాటికి ఏనుయ్యో, గొయ్యో చూసుకునేవాళ్ళం," అంటూ ఓదార్పు మాటలతో పాటు రెచ్చగొట్టే మాటలు కూడా చెప్పి వెళ్ళిపోయారు.

అమ్మలక్కలన్న మాటలు, నూటికి నూరు పాళ్ళూ నిజమేననిపించాయి సీతమ్మకు. ఇక భర్తతో వేగడం తనవల్ల కాదనుకున్నది. ఆత్మ హత్య చేసుకోవడం ఒక్కటే మార్గంలా తోచిం దామెకు. ఆ సంగతి భర్తకు ఒక ఉత్తరం రాసి, మంచం మీద పెట్టి ఇంటి నుంచి బయలుదేరింది.

వెంకటయ్య ఆ మర్నాటి సాయంత్రం పెళ్ళి నుంచి తిరిగొచ్చాడు. ఇంట్లో భార్య రాసి పెట్టి పోయిన ఉత్తరం కనబడిందతడికి. దాన్ని చదివిన వెంకటయ్యకు ముచ్చెమటలు పోశాయి. పరుగులాంటి నడకతో ఊరంతా తిరిగాడు. ఎక్కడా భార్య తాలూకు శవం కన బడలేదు.

చివరకు వెంకటయ్య భయంభయంగా, ఆమె పుట్టింటికెళ్ళాడు. వాకిట్లో సీతమ్మ తండ్రి పరంధామయ్య కూర్చుని వున్నాడు. వెంక టయ్య ఆయన చేతిలో భార్య రాసిన ఉత్తరం పెట్టి బావురుమన్నాడు.

పరంధామయ్య ఉత్తరం సాంతం చదివి, వెంకటయ్యతో, "అల్లుడూ! నిన్న సాయంత్రం నువ్వు పెళ్ళికి వెళ్ళాక, సీత ఈ ఉత్తరం రాసి నట్టున్నది. అంటే,ఆ ఆత్మహత్యేదో అమ్మాయి నిన్న చేసుకుని వుండాలి. అయితే, ఇంట్లో అమ్మాయి సీతలాంటిదే మరొక అమ్మాయి తిరుగుతున్నది. ఈవిడెవరు? దాని ప్రేతం కాదుగదా?" అన్నాడు.

అంతలో లోపలి గదిలోంచి సీతమ్మ బయ టికొచ్చి, తండ్రి చేతిలోని ఉత్తరాన్నీ, ఆ పక్కనే కూర్చుని వున్న భర్తనూ చూసి, ఏదో గుర్తొచ్చిన దానిలా తల గోక్కుంటూ, "అయ్యో, నా మతిమరుపు మండా! ఆత్మహత్య చేసుకుం దామని ఇంట్లోంచి బయలుదేరి, ఇక్కడ పుట్టింట తిష్ఠవేశానేమిటి? కోపిష్ఠి మొగుడితో కాపరం ఇక నావల్ల కానేకాదు!" అంటూ పెర ట్లోని బావికేసి పరిగెత్తింది.

ఆ వెంటనే వెంకటయ్య ఒక్క దూకున పోయి భార్యను పట్టుకుని, "ఆగు, సీతా ఆగు! నా కోపం నీ ప్రాణం తీయబోతే, నీ మతి మరుపు దాన్ని రక్షించింది. నా కోపం నీ ప్రాణాన్ని తీసేటంతటి దుష్టశక్తి అని, నేనే నాడూ అనుకోలేదు. అలా అనుకుని వుంటే నేనెప్పుడో మారివుండే వాణ్ణి. ఇక ముందే నాడూ నీమీద కోపగించుకోను. ఈనాటి నుంచీ శాంతాన్ని అలవర్చుకునేందుకు ప్రయత్ని స్తాను. నన్ను క్షమించు!" అన్నాడు.

సీతమ్మ, భర్త రెండుచేతులూ పట్టుకుని, "అంతమాటనకండి!నాలోనూకాస్త – కాస్తేం బోలెడంత మతిమరుపు జబ్బున్నది. నేను దాన్నినయం చేసుకునేందుకు ప్రయత్నిస్తాను," అన్నది.

అంతా వింటున్న పరంధామయ్య, వాళ్ళ దగ్గరకు వచ్చి, "భార్యాభర్తలంటే ఇలా ఒక ర్నొకరు అర్థం చేసుకుంటూ కాపరం సాగిం చాలి. అప్పుడు కోపాలూ, మతిమరుపులూ వాటికవే సర్దుకుపోతాయి. ఇంకో ముఖ్యమైన సంగతి; భార్యాభర్తల మధ్య ప్రేమానురాగాలకు తప్ప క్షమాపణలకు ఏమాత్రం తావులేదు!" అన్నాడు.

ఆ మాటలకు వెంకటయ్యా, సీతమ్మా తలలు వంచుకుని చిన్నగా నవ్వుకున్నారు.



# ప్రకృతి వింతలు

## ఎగిరే నక్కలా?



ఎగిరే నక్కల గురించి ఎప్పుడయినా విన్నారా? అదెలా సాధ్యం అంటారా? నిజమే. ఇవి నక్కలు కావు; ఒకరకం గబ్బిలాలు. వీటి ముఖాలు మాత్రం నక్క ముఖాలు. కాబట్టి వీటికాపేరు వచ్చింది. మలేసియా అడవులలో ఇవి ఎక్కువగా నివసిస్తాయి. మెత్తటి పళ్ళ నుఇష్టపడి తింటాయి. ఇవి రెక్కలతో పళ్ళను తినడం చూడడానికి చాలా వింతగా వుంటుంది. వీటి ఒక్కొక్క రెక్క నాలుగడుగుల పొడవు వుంటుంది. వీటి ప్రధాన ఆహారం పళ్ళేగనక వీటిని ఇళ్ళల్లోసులభంగా పెంచవచ్చు. అందుకు మొదట పెద్ద గూళ్ళు కావలసి వస్తాయి. మచ్చిక చేసి పెంచడం వల్ల, పెరిగాక ఇవి ఇల్లు వదిలి పోవు. మిగతా గబ్బిలాలలాగే తల్లకిందులుగా వేళ్ళాడుతూ ఉంటాయి.

## హానికరమైన పుట్టగొడుగులు!



దాదాపు ప్రతి మొక్కా ఎదగడానికి వెలుతురు కావాలి. కాని, పుట్టగొడుగులకు మాత్రం ఎలాంటి వెలుతురూ అవసరం లేదు. వర్షాకాలంలో తెల్లవారగానే లేచి, పచ్చగా వున్న తోట మధ్య నడిచారంటే – నిన్న సాయంకాలం కనిపించని పుట్టగొడుగులు చాలా పుట్టుకొచ్చి ఉంటాయి. పిల్లలు వాటిని సరదాగా చేతిలోకి తీసుకుని చిదిమేస్తూ ఉంటారు. అయితే వీటిలో కొన్నిచాలాహానికరమైనవీ, విషపూరితమైనవీ ఉంటాయి. తాకగానే దురద పుడుతుంది. అనారోగ్యానికి గురిచేస్తాయి. ఏవి మంచివో, కావో అనుభవజ్ఞులకే తెలుస్తుంది. కాబట్టి, పిల్లలు వీటి పట్ల జాగ్రత్తగా ఉండడం అవసరం!

## సూర్యుడి మరణం!



సూర్యగోళ కేంద్రంలో వున్నహైడ్రోజన్ లేకుండా పోయే రోజును ఊహించగలరా? అప్పుడు జరిగే అణువిస్ఫోటం కారణంగా మొదట సూర్యగోళం పెరిగి బ్రహ్మాండమైన ఎర్రటి గోళంగా తయారవుతుంది. దాంతో భూగోళం బూడిదయిపోతుంది. ఆ తరవాత సూర్యగోళం ఇప్పుడున్న దానికి నూరింతలు పెద్దదై అంతరిక్షంలో పొగ ఉంగరంలా మారిపోతుంది. అయినా, ఇదంతా ఎప్పుడు జరుగుతుందనుకున్నారు? కోట్లాది సంవత్సరాల తరవాత జరుగుతుందని విజ్ఞానవేత్తలు చెబుతున్నారు!

Say "Hello" to text books and friends
'Cause School days are here again
Have a great year and all the best
From Wobbit, Coon and the rest!



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1994 సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



S.G. Seshagiri



S.G. Seshagiri

* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * జూలై నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. * వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

## మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : చల్లగాలిలో సరదా చదువు! రెండవ ఫోటో : సరదా కాదిది, బతుకు తెరువు!!

పంపినవారు : ఎ. ప్రభాకరరావు. ఎ.ఇ. ఛీఫ్ ఇంజనీరు ఆఫీసు, నాగార్జున సాగర్ రైట్ కెనాల్స్, గుంటూరు - 522 004. (ఆం. ప్ర)

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.


చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 48.00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

**Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.**